

# అందమైన రూపము
# అందరికీ నచ్చేలా పనిచేయు
# మిల్లర్ సైకిల్ డైనమో
# లైటింగ్ సెట్‌లు

క్రోమియంప్లేటింగ్ చేయబడిన మిల్లర్ సైకిల్ డైనమో లైటింగ్ సెట్‌లు వాటి దృఢమైన నిర్మాణము, ఉన్నతమైన సామర్థ్యము, ఆధునికమైన రూపములచేత ప్రత్యేకతను సంతరించుకున్నవి. అవి ఎదురుగా 30 గజాల దూరంవరకూ కాంతిని ప్రసరింపజేస్తాయి. మరియు ప్రకాశమైన వెనుక దీపంవలన మీ భద్రత పరిరక్షింపబడుతూ ఉంటుంది.

ప్రత్యేకతలు :

- తక్కువ వేగములో నడిచేటప్పుడుకూడా వెలుతురు తగ్గకుండా ఉండడానికి ఎనిమిది పోల్ మాగ్నెట్ రోటార్
- డైనమో ఒకే రకంగా స్థిరంగా పనిచేసే ఏర్పాటు; వేగంగా పోయినా బల్బు మాడిపోదు
- వెలుతురు బాగా ఉండడానికి ప్రత్యేకంగా వాక్యూమ్ మెటలైజ్డ్ రిఫ్లెక్టర్
- వాతావరణం ఎగుడుదిగుడులకు తట్టుకోగల ఏర్పాటు
- పగలకుండాను, గీరలు పడకుండా ఉండగల "దయాకోన్" ఫ్రంట్‌లెన్స్.

మిల్లర్ ల్యాంప్ వుంటే మీరు సర్వదా సరియైన దారిలోనే వుంటారు.

95 సంవత్సరాలకు పైగా పేరు ప్రఖ్యాతులు గాంచిన హెచ్. మిల్లర్ & కంపెనీ లిమిటెడ్ బర్మింగ్‌హాం. యునైటెడ్ కింగ్‌డమ్ వారి సహకారంతో ఉత్పత్తి చేస్తున్నారు.

**టిఐ మిల్లర్ లిమిటెడ్, మద్రాసు-1**
**వర్క్స్: అంబత్తూరు, మద్రాసు-53**

® హెచ్. మిల్లర్ & కం., లి., యు.కె వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.
ఇండియాలో ఉత్పత్తిదారులు: మిల్లర్ లి., మద్రాసు-1. రిజిస్టర్డ్ వాడకందార్లు.

టిఐ వారి సంస్థలలో ఒకటి




FDS TIM 687A TE

# ఉత్తరాలు

## తెలుగు రచయితల మహాసభ

జనవరి 1967 మొదటి వారంలో కృష్ణాజిల్లా తెలుగు రచయితల మహాసభ విజయవాడలో నవ్యసాహితీ సమితి, విజయవాడ శాఖ ఆధ్వర్యమున నిర్వహించబడుతుంది.

ఈ మహాసభ ఒకరోజు జరుపబడుతుంది.

ఉదయము — కవిత్వముపై సదస్సు, తరువాత ప్రతినిధుల సమావేశము, మధ్యాహ్నం— కాల్పనిక సాహిత్యం గురించి సదస్సు, సాయంకాలం—సాంస్కృతిక సమ్మేళనము జరుపబడును. కృష్ణాజిల్లాకు చెందిన ప్రముఖ రచయితలు, కళాకారులు ఈ సభలో పాల్గొని ప్రసంగిస్తారు.

కృష్ణామండలములోని రచయితలను ఒక్కచోట చేర్చి పరస్పరావగాహనము కల్గించడమే యీ ప్రయత్నంలోని ప్రధాన లక్ష్యము.

ఈ సభలో పాల్గొనుటకు ప్రతినిధులుగా రాదలచిన రచయితలు తమను గురించిన సర్వ వివరములతో, ప్రతినిధి రుసుము ఒక రూపాయి కార్యదర్శి, నవ్యసాహితీ సమితి, రామవరప్పాడు, (వయా) విజయవాడకు పంప ప్రార్థితులు.

ఈ మహాసభలో పాల్గొని మా ప్రయత్నమును జయప్రదము చేయవలసినదిగా అందరికీ సవినయముగా విజ్ఞప్తి చేస్తున్నాము.

ఇట్లు,
ఆహ్వాన సంఘము.

## కథలు

మీ దీపావళి సంచికలో ప్రథమ బహుమతి పొందిన "చుక్కల్లో చంద్రం" అనే కథ చాలా అద్భుతంగా వుంది. చాలా కాలానికి ఒక మంచి కథను చదివిన సంతృప్తి ఆనందం కలిగాయి.

ఎంతటి కఠినపు గుండెల వాళ్ళకైనా కన్నీరు ఆగలేదంటే అది ఆకథలో కవయిత్రి చూపించిన కౌశల్యమే కాకుండా స్త్రీ హృదయం అందులో మాతృహృదయంలోని విచిత్ర పరిణామాలు స్థాయి మనకు గోచరించాయి.

అందరికంటే చిన్నవాడై చంద్రం అందరికంటే ఉత్తముడుగా ఉదాత్తుడుగా భాసిల్లడం పసిపిల్లలు భగవంతుని అవతారాలు అనే మాట ఎంత నిజమో మనకు అతి స్పష్టంగా తెలుస్తున్నది.

ప్రాజ్ఞులం, పండితులమని భ్రమసే యీ పెద్ద వాళ్ళ కంటే అమాయకులై స్వచ్ఛంద హృదయులైన యీ చిన్నారి గోపాలుర దగ్గర మనం నేర్చుకో వలసిన నగ్న సత్యాలు, జీవిత వేదాంతాలు ఎన్నో వున్నాయి. ఎంతటి మహనీయుడినైనా కాలసర్పం కాటు వేయక మానదు. కాని కొందరు జీవించినా మరణించినా తనవారందరికీ, విజ్ఞానాన్ని వివేకాన్ని మనసారా అందించి పంచిపెడతారు.

చంద్రం అన్నమాటలు నిజమే. ఈ గడ్డమీద అతను వచ్చిన పని పూర్తి అయిపోయింది. అతని అవతారం చరమ సీమలు అందుకుంది. 'మృత్యోర్మా అమృతం గమయ' అన్న బుద్ధవాణి మనమనస్సులో పదే పదే మారు మ్రోగుతుంది. మనకు అందక పోయినా దూరమైనట్టు కనిపించినా చంద్రం అందరిలోను వున్నాడని అనిపిస్తుంది. నిజమే!

మల్లాది మూర్తి బాబు (మచిలీపట్నం)

*  *  *

చుక్కల్లో చంద్రం కథ తెలుగు కథాసాహిత్యానికి ఒక కొత్త యుగాన్ని ప్రారంభించేది అన్నంత గొప్పగా ఉంది. ఆ కథలో ప్రతిమాటా తెలుగుతనాన్ని చిప్పిలుతోంది. హెమింగ్వే ఓల్డ్‌మేన్ కంటె గొప్పవాడు చంద్రం. షేక్స్పియర్ షైలాక్ స్థాయిలో ఉంది రత్తమ్మ పాత్ర చిత్రణ. సాహిత్యమూ జీవితమూ వాస్తవికతా తెలుగు నుడికారమూ సమాజమూ విడదీయలేనంత సన్నిహితంగా కలిసిపోయాయి కథలో. మానవత్వాన్ని మేల్కొల్పగల శక్తి ఈ కథలోని ప్రతివాక్యానికీ ఉంది. ఆధునిక సమాజంలోని విరుద్ధ భావాల ప్రతినిధులున్నారు. కథలో ప్రధాన పాత్రలుగా చెదున్నైన భావాలతో పాటూ సరళమైన వాక్యాలు కథా శిల్పాన్ని నూటికి నూరుపాళ్ళు సమగ్రంగా సమకూర్చాయి.

శ్రీపతి, (హైదరాబాదు)

*  *  *

11—11—66 తేది ఆంధ్రసచిత్ర వారపత్రిక దీపావళి సంచిక లో ప్రచురించిన "చుక్కల్లో చంద్రం" దీపావళి కథల పోటీలో మొదటి బహుమతి పొందిన కథ హృదయవిదారకంగా వుంది. ఇది కథ మాత్రమే అని సరిపెట్టుకొని ఇట్టి అమానుష కృత్యం ఎక్కడా జరుగదనుకుంటాను. అయితే ఇదే మాదిరి విషాదాంత సంఘటన సుమారు 3 దశాబ్దాల క్రితం వాస్తవంగా జరిగింది. గంజాం జిల్లా ఏజన్సీ ప్రాంతంలో ఒక పల్లెటూరిలో (పేరు: "గారబంద" అని జ్ఞాపకం) బడిపంతులు, ఒక చిన్న విద్యార్థికి విధించిన శిక్ష—బడి ఆవరణలో వున్న ఒక కొట్లో బంధించగా అందులో చెత్తసామానులలో దాగియున్న ఒక కొండచిలువ ఆ పిల్లవానిని మ్రింగి చంపిందని వార్తాపత్రికలలో వెలువడింది. ఎన్నడో జరిగిన ఈ గాథ ప్రస్తుత రచయిత్రిగారికి తెలియకపోవచ్చు. కథ చాలా రసవంతంగానూ గుణపాఠంగానూ వుంది.

'ఒక డాక్టరు' (హైదరాబాదు)

## ముఖచిత్రం

దీపావళి కథల పోటీలో రెండవ బహుమతి పొందిన కథ "అవుటర్ సిగ్నల్" చాలా బాగున్నది. మిగతా రెండు కథలూ ముఖ్యంగా, ముఖచిత్ర చిత్రీకరణలతోను, వివిధ శీర్షికల సమూహంలో ఈ సంవత్సరం దీపావళి సంచిక సరికొత్త సుమాలను అలంకరించుకొని, మమ్మెంతో ఉత్సాహపరచినది.

పి. హెచ్. రామ్మోహనరావు
(హైదరాబాదు)

*  *  *

సీరియల్ "సుప్రభాతం" మనసును ఉత్సాహపరిచి, మళ్ళీ సంచిక ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూచేటంత ఉత్సుకత వేసింది నాలో.

కథలు "వాళ్ళు ముగ్గురు" కథానికా జంటకవులు బ్రహ్మాండంగా రాశారు. వారికి నా కృతజ్ఞతలు.

ఇక "జీవితం" "ప్రయాణం" కథలు ఫరవా లేదనిపించాయి.

జి. యస్. వీరారెడ్డి, (కోకటం.)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 16—12—'66

సంపుటము : 59 సంచిక : 14

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీథి, మద్రాసు-1

చందా వివరాలు :
భారతదేశం

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 32.00 |
| అర్ధసంవత్సర చందా | 16.00 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం : నటి భారతి
(ఫోటో : ప్రభాకర్)

కథలు :











# ఆహార సమస్య - ప్రభుత్వ విధానము

"అంతరిక్షాన్ని అందుకొంటున్న వైజ్ఞానిక శకంలో నివసిస్తూ, శాంతి సంగ్రామాల మధ్య రాజీ కుదుర్చుకోలేని సమస్యల్లోను, అజ్ఞానాన్ని పక్షపాతాన్ని ఏమరచలేని అసమర్థతలోను, క్షామాన్ని శేషాన్ని నిరోధించలేని అసహాయతలోను, చరిత్ర మలుపు తిరుగుతున్న చోట అమెరికా ప్రజలు నిలబడి వున్నారు. ఇది వ్యక్తిగతమైన సమస్య కాదు. ఇరు పార్టీలకు చెందిన ఇద్దరు మనుష్యుల మధ్య సమస్య కాదు. ప్రభుత్వ సంపత్తి—ప్రజల సుఖానికి చెందిన సమస్య ఇది. ప్రగతిపథంలో అభ్యుదయానికి—స్థిరమైన, లిమిరమైన సాధారణ వాతావరణానికి సంబంధబాంధవ్యం ఇది."

ప్రెసిడెంట్ కెన్నడీ పదవి నలంకరించినప్పుడు చెప్పిన ఆయన వేదాంతానికిది సంక్షిప్త సమీక్ష. ఇటీవల హిందూదేశం కూడా అజ్ఞానాన్ని పక్షపాతాన్ని జయించలేని అసమర్థతతోను, క్షామాన్ని—దారిద్ర్యాన్ని పరిష్కరించలేని అసహాయతతోను, పార్టీలకు—ప్రభుత్వానికి మధ్య ప్రతికూల వాతావరణంతోను, గాంభీర్యమైన జాతీయత-క్షీణిస్తున్న జాతీయతతోను, అభ్యుదయ పథము—ఓట్ల భద్రతలతోను రాజీ కుదుర్చుకోలేక సతమతమైపోతూ వుంది.

వియత్నాం వ్యవహారంలో ప్రెసిడెంట్ జాన్సన్ ఎలాంటి పట్టుదలతో వున్నారో శ్రీమతి ఇందిరా గాంధి ప్రభుత్వానికి తెలుసు. అయినా వియత్నాం గురించి అమెరికామీద వ్యతిరేక ప్రచారం మొదలెట్టింది. ప్రపంచశాంతి కోసం వియత్నాం మీద బాంబుల్ని వేయడం ఆపమని మాస్కో దగ్గర్నుంచి దాదాపు అన్నిదేశాలు సవినిష్టి ప్రకటనలు చేసివున్నాయి. తన యిల్లు చక్కబెట్టుకోలేని భారతప్రభుత్వం విదేశాల్లో శాంతి సంబంధాల కోసం మధ్యవర్తిత్వం వహించింది! కీర్తిశేషులు కెన్నెడీ కాలంనాటిల్లోంచి ఒక ఉదాహరణ ఎంతైనా ఉపయోగిస్తుంది. ప్రపంచ వ్యవహారాల్లో హిందూదేశం జోక్యం కలగజేసుకుంటే స్వప్రయోజనాన్ని సాధించడానికి ఎంతైనా అవకాశముందని చాలమంది సలహా యిచ్చినా నెహ్రూ గారు ఆ సలహాలను త్రోసిపుచ్చారని కెన్నెడీ అన్నారు. అంత సామర్థ్యం మనకు లేదని నెహ్రూ గారే వెనక్కు తగ్గినప్పుడు ఆయన కుమార్తె సమర్థురాలా? చైనా వాళ్ళు మన మీదికొచ్చినప్పటి నుంచి ఎందుకనో ప్రపంచ వ్యవహారాల్లో మన కంతగా బలం లేకుండాపోయింది. నిజంగా చెప్పాలంటే, సవినిష్టి ప్రకటనలన్నీ నీళ్ళ మూటలు. ఇటువంటి ప్రకటనలకు తుపాకులు అండగా నిలిచినప్పుడే వాటికి బలం. అందుకు మనదేశం వెనకబడే వుంది.

ఒకవిధంగా చెప్పాలంటే రేడియోలోనూ, సభావేదికల మీదా, పత్రికాముఖంగాను వియత్నాం వ్యవహారం మీద చేస్తున్న ప్రచారం వల్ల మనకొరిగి పడిందేమీలేదు. కాగా చేతులు కాల్చుకుంటున్నాము. మరో కోణం నుంచి ప్రశ్నించడానికి అవకాశం లేకపోలేదు. నేపాల్‌లో గనక హిందూదేశం మీద వ్యతిరేక ప్రచారం ప్రారంభమైనట్టయితే, హిందూదేశం యొక్క వైఖరి ఎలా వుండేది? ముఖ్యంగా దేశంలోని కమ్యూనిస్టు పార్టీ పరిస్థితి ఎలా వుండేది? అనేది అస్పష్టమైన విషయం.

ఇక్కడ ప్రభుత్వానికి నచ్చజెప్పాల్సిందేమిటీ అంటే, ప్రపంచ వ్యవహారాలు మన కక్కర్లేదు; అవి మనకు ఎలాగూ ప్రయోజనం కావు; నోటి దగ్గరకొచ్చిన ఆహారాన్ని ఎందుకు చెడగొట్టుకోవాలి? అని. హిందూదేశం అభివృద్ధిలోకి రావడానికి, పరపతి సంపాదించుకోడానికి పరిహాస్యప్రాంతాలు మాత్రం గబ్బిలాలుగా వుండి పోవాలి!

ఆహార పరిస్థితిని పరిశీలించి చూసినట్టయితే, శ్రీజైరామ్‌దస్ దౌలత్‌రామ్ గారి హయాములో ఆహారమంత్రిత్వ శాఖను పూర్తి పారేయాలనే అభిప్రాయం ఒకటుంది. ఆహారధాన్యాల సప్లయి అంతకంతకు కుంటుపడుతోంది. తలసరి సరఫరా రెండు ఔన్సులకు పరిమితమైపోయింది. స్వంత అనుభవంగా చెప్పాలంటే, కొట్టక్కరలేదు తిట్టక్కర్లేదు అనే సామెతగా రేషన్‌ను తగ్గించేస్తే రోగం అదే కుదురుతుంది. వాళ్ళు వీళ్ళు సహాయం చేయడంలేదన్న ఆరోపణ వుండనే వుందిగదా!

ప్రభుత్వపద్ధతి మరింత శోచనీయంగా వుంది. ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ దేశంలో క్లిష్టపరిస్థితుల గురించి మాట్లాడుతూ, స్వతంత్రదినం రోజున అర్భాటాల కోసం కనీసం పదిలక్షల రూపాయిలైనా ఖర్చుపెట్టి వుంటారు.

## గోవధ నిషేధాందోళన

కొందరు కాంగ్రెసు నాయకులతో సహా, గోవధ నిషేధం దేశమంతటా అమలు జరగాలని ఆందోళనలు సాగిస్తున్నారు. అయితే ఆందోళనకు సూత్రధారులైన సేట్ గోవింద్ దాస్ గారు-ఈ పంథొమ్మిది సంవత్సరాలనుంచీ గోవును సంరక్షించడానికి, దాని యోగక్షేమాల్ని విచారించడానికి ఎటువంటి ప్రయత్నాలు చేశారో ఫక్తు కాంగ్రెసువాదులైనవారు సెలవీయనే లేదు. మన దేశంలో పనికిరాని పశువుల పోషణకుగాను, ఇరవైలక్షల టన్నుల గోధుమను అప్పుగా ఇవ్వడానికి ఒక విదేశీ ప్రభుత్వం 'మీ దేశంలో అలాంటి పశువు లెన్నున్నాయో! లెక్క చెప్పండి' అన్నది.

చిత్రించబడినంత కొరత ఇప్పుడు మన ఆహారధాన్యాల్లో వున్నదా అనేది ఆలోచించవలసిన విషయం. బీహార్లోను, ఉత్తరప్రదేశ్‌లోను ఇటువంటి క్షామపరిస్థితులున్న మాట వాస్తవం. తీవ్రమైన క్షామపరిస్థితి అంటే ఏమిటీ? అనే ప్రశ్న ఇక్కడ ఉదయిస్తుంది. కోటిరూపాయిలు గోవధ నిషేధాందోళనకు ఢిల్లీలో ఖర్చు పెట్టబడిందే? సాధువులకు, తక్కిన ఆందోళనకారులకు వండి పెట్టడానికి నాలుగువందల మంది వంటలవాళ్ళు రావింపబడ్డారే? ఈ డబ్బు బీహార్‌లోను, ఉత్తరప్రదేశ్‌లోను

వున్న కొన్నిలక్షల మంది క్షామపీడితులకు సహాయం చేసి వుండేది కాదా? ఈవిధా ప్రదేశాల్లో మలమలమాడి పోతున్న మనుష్యుల కంటే, క్షీణించిపోతున్న పశువుల కంటే ఈ గోవధ నిషేధం మీద ఇంత డబ్బు వెచ్చించడం ప్రధానమై పోయింది!

## ఎరువుల పరిశ్రమ

హిందూదేశం యొక్క స్వయం సంపాదనా కృషిని బట్టి అమెరికా ఆహారధాన్యాల్ని సరఫరా చేస్తున్నదన్నమాట రహస్య మేమీ కాదు. రాజకీయాల వలావుంచి ఎరువుల ఉత్పత్తిని అందుకు సాధన సామాగ్రిని పరిశీలించినట్లయితే అందులో మరిన్ని రాజకీయాలు! కమ్యూనిస్టులు, వారి కాంగ్రెసు మిత్రులు అమెరికాను దుయ్యబడుతున్నారు. మనదేశం స్వయంపోషకం కావడానికి అనేక విధానాలున్నాయి. క్రిమి నిరోధానికి ఒక శాఖ వుంది. కాని ఎలుకల్ని, కోతుల్ని సంహరించడానికి ప్రయత్నాలు జరుగుతున్న సూచనలేదు. మూషిక సంహారం తర్వాత ఆహార పరిస్థితిలో కొంత మెరుగుదల కనిపిస్తుందని కాగితాలు మాట్లాడుతున్నాయి. ఆవుల్ని తీసుకుంటే, అవి నిర్దాక్షిణ్యంగా తయారై కొన్నిరాష్ట్రాల్లో పంటలు పాడు చేయడానికి కారణాలవుతున్నాయి. బీహార్‌లోను, ఉత్తరప్రదేశ్‌లోను అన్నమో రామచంద్రా అంటూ అలమటించిపోతున్న ప్రజల్ని కనికరించడానికి ఇలాంటివి కొన్ని అడ్డు తగులుతూనూ వుంటాయి మరి!

రాజకీయాల్లో ఇరుక్కున్న ఎరువుల పరిశ్రమ పరువు తీసుకున్నది. అమెరికా వాళ్లను నమ్మొద్దు; ఎరువుల పరిశ్రమకు వాళ్ల సహాయం మనకు అక్కర్లేదు అనే కమ్యూనిస్టులు, వారి కాంగ్రెసు మిత్రులు పెట్రోలియం శాఖకు చెందిన మంత్రిగారి మీద వత్తిడి తీసుకొస్తున్నారు. భిలాయ్, బొకారోలో ఎరువుల పరిశ్రమల్ని నిర్మించడానికి సోవియట్ రష్యాకు అవకాశం ఇవ్వలేదు. అంచేత ఎరువుల పరిశ్రమలు పాశ్చాత్యుల, జపాన్ వారి సహాయ సహకారలతోనే స్థాపించ బడాలి! ఇటలీ అప్పుడే నాలుగుఎరువుల పరిశ్రమలకోసం సాధన సంపత్తిని పోగు జేసి పెట్టింది. జపాన్ ప్రభుత్వం అంగీకారంమీద 'హితాచీ' సంస్థ కొన్ని పరిశ్రమల్ని మన దేశంలో నెలకొల్పడం కోసం ఉద్దేశించింది. ఇతర దేశాల్నుంచి అప్పు పుట్టక పోతే, ప్రభుత్వరంగంక్రింద ఎరువుల పరిశ్రమల్ని నిర్మించే వారికి విదేశీ మారకద్రవ్యం వూరికే యిచ్చేస్తామని మంత్రిగారు పార్లమెంటులో చెప్పారు. ఊర్పూరికే యిచ్చే విదేశీ మారకద్రవ్యం ఎలా వస్తుంది?

## కంప్యూటర్ల ప్రవేశం

లైఫ్ ఇన్సూరెన్సు కార్పొరేషన్‌లో కంప్యూటర్లు ప్రవేశపెట్టడం గురించి ప్రతిపక్షాల్లో వారున్న ప్రముఖులు కొందరు తమ తమ అభిప్రాయాల్ని వెలిబుచ్చారు. కంప్యూటర్లను ప్రవేశపెట్టినందు వల్ల ఇప్పుడు పని చేస్తున్నవారి ఉద్యోగాలకుగాని, జీతభత్యాలకు గాని ఎటువంటి హాని జరగదని; ఏ ఒక్క ఉద్యోగి యిందువల్ల నష్ట పోయేది వుండదని ఆర్థికమంత్రి హామీ యిచ్చారు. ఉద్యోగాల్ని తొలగించడం కూడా వుండదు. కంప్యూటర్లని ప్రవేశ పెట్టడంలోని ప్రధానోద్దేశాల గురించి, అవకాశాల గురించి ఆ తర్వాత చర్చించ బడింది. ఇందు విషయమై ఉద్యోగులు సంప్రతించగోరుతున్నారనే ప్రశ్నకు ఆర్థిక మంత్రిగారు తొణకలేదు బెణకలేదు. మంత్రి శ్రీ జగ్‌జీవన్‌రామ్ తమ అసనంతో అధిష్టించి చిరునవ్వులొలకబోస్తూ, తోటి ఆర్థికమంత్రి నిర్మాణాత్మకవిధానానికి సంతోషించారు!

అభ్యుదయ పథగాములు శ్రీయుతులు లాలా గుల్జారీలాల్ నందా, జగ్‌జీవన్‌రాం గారలే ప్రత్తిపరిశ్రమ దిగజారి పోడానికి కారణమంటే హాస్యాస్పదంగా వుంటుంది. వారు 'ఆటోమేటిక్ లూమ్స్' ప్రవేశపెట్టడానికి అంగీకరించలేకపోయారు! పైగా అడ్డు తగిలారు. ప్రత్తిపరిశ్రమ ఎదుర్కొంటున్న తీవ్ర పరిస్థితి దృష్ట్యా, కార్మికులకు ఎక్కువ హాని జరక్కుండా 'ఆటోమేటిక్ లూమ్స్'ని ప్రవేశపెట్టి నెమ్మది నెమ్మదిగా పెంచడం ఉత్తమపద్ధతి అని వాణిజ్యమంత్రి శ్రీ మనూభాయ్‌షా పార్లమెంటులో చెప్పారు. ధాన్యాన్ని ఎగు చేసే బొంబాయిలోని యంత్రానికి అడ్డు నిలబడుతున్నదీ ఈ ఇద్దరు కాంగ్రెసు నాయకులే.

ఏ పారిశ్రామికరంగానికి చెందినా సరే, కార్మికుల అభివృద్ధినే వాంఛిస్తూ అందుకోసమే పాటుబడుతున్నాం అంటారు ఈ నాయకులు. గ్రామాల్లో శ్రమజీవుల్ని కట్టిపారేసి ట్రాక్టర్లు ప్రవేశపెట్టినప్పుడు వీరు అడ్డుచెప్పలేదు. యంత్రాలు పెరిగే కొద్దీ ఎడ్లబళ్లుకూడా మూలబడి పోతున్నాయి. మోటార్ల వల్ల టాంగాల వాళ్ళు అంగలారుస్తున్నారు. ఇటువంటి [illegible] మూసుస్తూ యంత్ర[illegible] వారి స్థానాన్ని ఆక్రమించు కొంటున్నప్పుడు శ్రీయుత యస్. యస్. బెనర్జీ గారుగాని, లాలా గుల్జారీలాల్ నందా గారుగాని ఎటువంటి సానుభూతి చూపించారు? ఏం కృషి చేశారు? ఏమీ చేయ లేదు! ఎందుకూ అంటే ఈ [illegible] రకం శ్రమజీవులకి ఒక సంఘమూ సమావేశమూ లాంటి వేమీ లేవు గనక. మన నాయకులు ఆశించేది ఓట్లు. ఎవరెన్ని ఘనకార్యాలు చేసినా పరమాపది ఆ వోటే. సంఘాలేర్పరచుకున్న కార్మికుల వల్ల, శ్రామికులవల్ల మంత్రులు లాభం పొందగలరు. కాని విడివిడిగావున్న టాంగా డ్రయివర్లేం చేయగలరు? కూలిపనివాళ్లేం చేయగ్గలరు? ●

హాకీ ఆటనాడే రాజుకు వెన్నునొప్పి













# ఒకే ఒక సారిడన్

'రోష్'

## నొప్పిని పోగొట్టును, పెదదెర్చును, నవోత్సాహమును కలిగించును।

నొప్పికి ఉపశమనకారిగా ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సారిడన్ నొప్పులనుండి త్వరితముగా, నిరపాయముగా, నిశ్చయముగా ఉపశమనం కలిగిస్తుంది. తలనొప్పి, పంటి నొప్పి, ఒళ్ళునొప్పులు, మామూలు అస్వస్థతలు మొదలైనవాటి నివారణకు ఎల్లప్పుడూ సారిడన్ వాడండి. ఒక బిళ్ళ పూర్తి మోతాదు. పిల్లలకు ¼ నుంచి ½ బిళ్ళ వరకు వెయ్యవచ్చును.




ఒకే ఒక సారిడన్ బిళ్ళ చాలును।

'రోష్' తయారు
ఏకైక డిస్ట్రిబ్యూటర్లు:
వాల్లాస్ లిమిటెడ్



# చరమ గీతి

శ్రీనాథుడు

అన్నది సుమతి.

అతను కన్నుల్లో కమ్ముతున్న నీటిని బలవంతాన ఆపుకొంటూ సుమతికి దణ్ణం పెట్టాడు.

సుమతి కళ్ళల్లో నీటి పొరలేవో కదిలి ఉండాలి. రోగి చూడకుండా ప్రక్కకు తిరిగి తుడుచుకొంది. అతను స్వింగ్ డోర్ తెరుచుకొని వెళ్ళడం చెప్పుల చప్పుడు నీరసంగ దూరంలోకి మెట్ల మీదుగ పోవడం—వీధి వాకిలి దగ్గర రిక్షా గంట మోగడం—విన్నాకగాని సుమతి ఇటుకేసి తిరగలేదు.

అసలే ఆవిడ మనసంతా ఎందుకో చిరాగ్గా ఉన్నది. దానికితోడు ఈరోగి—అదే—కాంతారావు—దాన్ని మరింత అల్లకల్లోలం చేశాడు. ఓ దశలో తనను తాను నిగ్రహించుకోవడమే కష్టమయింది. చేతులు వణికాయి. శరీరం యావత్తూ ఏదో ఆవేశించినట్లయి ఉక్కిరిబిక్కిరయి తొక్కిసమక్కిసలాడిపోయింది.

ఇంత జరగడానికీ కారణం— కేవలమూ ఆ పేరు! అది వింటే తన కిప్పటికీ పిచ్చెత్తిపోతుంది. ఒకప్పుడైతే ఆ పిచ్చిలో బ్రహ్మానంద మనుభవించింది తను. ఇప్పుడా పిచ్చిలో కోపం పగ క్రౌర్యం పడగలెత్తి బుసలు కొడుతున్నాయి.

పాపం! అతను మాత్రం చేసిన తప్పేముంది గనక!! తన పేరు కాంతారావన్నాడు. తనకు ఏడాదినించీ ఈ నలత ఉన్నదన్నాడు. ఇంతకాలం తాత్సారం చేయడానికి తన దరిద్రమే కారణన్నాడు. ఇప్పటికయినా తను మంచి మంచి మందులు కొనుక్కోలేనన్నాడు. చౌకలో బాగా పనిచేసే వేమున్నా ఉంటే ఇప్పించమన్నాడు. ఈ రెండింటికీ ఎక్కడా పొత్తు కుదరదని ఈ దురదృష్టవంతుడికి తెలీదు.

ఈ మాటలన్నీ వింటూ తను రోగి ముఖంలోకి చూసినప్పుడు అందులో— దగా, మోసం, దౌష్ట్యం దుర్మార్గం, తన కగుపించాయి. నిజంగా అతనిలో ఇవేమీ లేకపోవచ్చు. ఆ పేరు పట్ల తనకున్న ద్వేషం వల్ల తనే వీటన్నింటినీ అతనిలో చూసి ఉండవచ్చు. ఇందులో ఏది నిజమో తనిప్పుడు తేల్చుకోలేదు. కానీ— అక్షరాన, అక్షరాలా తనలాంటి అనుభూతులకే లోనయింది!

ఆలోచిస్తుంటే తను అనుకొన్న దానికీ ఇప్పుడయిందానికీ ఎక్కడా సంబంధమే లేదు. జీవిత సూత్రాలు తన చేతుల్లో లేవనీ, ఎవరో వాటిని చేజిక్కించుకొని యథేచ్ఛగా తనను ఆడించుతున్నారనీ అని పించుతోంది! తను ఎక్కడ ప్రయాణం ప్రారంభించింది? ఎక్కడకు చేరుకుంది?? ఈ మధ్యకాలంలో ఎన్నో తుఫానులు ఉప్పెనలు తనను కకావికలు చేశాయి. అనేక పర్యా ఈ జీవితానికి చరమగీతం పాడేద్దామనిపించింది. కాని ఏదీ మన చేతుల్లో లేదని అనూహ్యమైన మరేదో శక్తికి మనమంతా కట్టుబడి ఉన్నామనీ ఒక్కో అనుభవమే రుజూ చేయసాగింది.

తనిలా కావడానికి కాంతారావు—అదే—కాంతం— ముఖ్యకారణమని, ఇప్పటికీ, తన నమ్మకం. ఒకవ్యక్తి, మరో వ్యక్తి జీవితాన్ని, ఎంతగా ధ్వంసం చేయడానికి వీలున్నదో, అంతా చేశాడు కాంతం! ఇందులో తప్పెవరిదన్న ప్రశ్నకు తావేలేదు. తన్నడిగితే, 'కాంతందే తప్పం'టుంది. బహుశా—అతను తనదే తప్పనవచ్చు. ఈ వాదవివాదాల మాటకేంగాని, దీని ఫలితంగా నష్టపోవటమయింది మాత్రం తనే!

అసలు కాంతంతో పరిచయం కావడమే చిత్రంగా జరిగింది. ఎవరో ఏదో అన్నదానికి, తను ఉడుక్కొని, ప్రిన్సిపాల్‌తో రిపోర్టు చేసింది. ఆయన గారు కాంతాన్ని పిలిచి, నాలుగు చివాట్లు వేసి పంపించారు. అతనేమీ అనలేదు. వంచిన తల ఎత్తకుండా అన్నీ భరించాడు. తరువాత నిశ్శబ్దంగా బయటికెళ్ళిపోయాడు. రెండు మూడు రోజులపాటు అతనెక్కడా కనిపించలేదు. నాలుగో రోజున తనకో ఉత్తరం వొచ్చిందంటూ నాన్నగారిచ్చారు. అది కాంతం రాసింది! తనను కలుసుకోవడానికి— ఇంటి దగ్గర కలుసుకోవడానికి ఎప్పుడు వీలుంటుందో తెలియచేయమన్నాడు. తన ఎడ్రెస్ కూడా ఇచ్చాడు. పోనీ కనిపిస్తే చెబుదామనుకొంది తను. వారందాకా, ఎక్కడా పత్తాలేదు. ఆఖరుకో కార్డు రాసి పడేసింది. మొన్న వచ్చాడు. ఎంత బితుకు బితుగ్గా వచ్చాడు! మాటల్ని కూడా ఎంత తేలిగ్గా అనేవాడు! అవి ఎక్కడ పగిలిపోతాయోనన్నంత భయంగా! నాన్న ఆట్టే పట్టించుకోలేదు గాని, తను మాత్రం, అదే పనిగా కాంతాన్ని చూడసాగింది. పసివాడి కన్నా అద్వాన్నంగా అతను కళ్ళంట నీళ్ళు పెట్టుకోడం చూస్తే 'అయ్యో పాపం!'

కిలా ప్రతి
పీల్పులో ఉల్లాసం

SPECIAL

QILA

SPECIAL



ఇపుడు
ఆకర్షణీయమైన
ఈ పెట్టెలో
దొరకును

QILA

SPECIAL CIGARETTES



వజీర్ సుల్తాన్ తయారీ.

అనిపించింది తనకు! ఇలాంటి 'తార్కికుడి' మీద రిపోర్టిచ్చినందుకు, ఎంత బాధపడిందో తనకు తెలుసు, భగవంతుడికి తెలుసు!

బహుశా— ఆ మంచితనమే, ఆ అమాయికతనమే, తనను, ఆకట్టి ఉండాలి. అతన్ని చూస్తుంటే, పసిబిడను చూస్తున్నట్లనిపించేది తనకు. అతని మాటలు కూడా అంత 'ఇది' గానూ ఉండేవి. ఓరకంగా అతనుత్త పిచ్చివాడను కొంటుండేది తను! ఆ పిచ్చికి తోడు, పిరికితనం కూడా ఉన్నదేమో, సుడిగాలిలోని వోసడాకులాగా, మనిషి ఇట్టే అల్లల్లాడి పోయేవాడు. కొంచెం గట్టిగా మాట్లాడితే, రవంత సేపు కళ్లెర్ర చేస్తే చాలు. తనలోకి తను ముడుచుకొని, మూతిని, సున్నాలా బిగించి, చూపుల్ని అంతర్ముఖం చేసుకొని అలా అయిపోయేవాడు. ఆ రూపంలో, అతన్ని చూస్తే తనకు జాలి, నవ్వూ కూడా వచ్చేవి. అతన్ని ఏదో మిషతో ఏడిపించి, బెదిరించి, ఆనందించడం తనకో సరదాగా ఉండేది.

నాన్నక్కూడా అతనంటే ఎంత అభిమానమో!

'బుద్ధభగవానుడు' అంటూండె వాడు నాన్న.

'తను మాత్రం, ఏడిపించాలనుకొన్నప్పుడు 'బుద్ధా' అని పిలిచేది. అయినా అతను ఉడుక్కోనే వాడుకాదు. నిశ్శబ్దంగా నవ్వేవాడు. పసిపిల్లలు మాత్రమే నవ్వగలిగినంత నిర్మలంగా.

కాంతం—ఇంతలా—వానపాములా, మారడానికి కారణం అతని పరిస్థితులే ననేవారు నాన్న! ఎంత పేదరికమో పాపం! పైగా పెళ్లి కావలసిన చెల్లెళ్లు కూడా ఉన్నారట! అదీగాక తండ్రికి ఎప్పుడూ జబ్బు. ఆ ఇంతలోనే ఏదో సర్దుకొని తనకు పంపుతూ ఉంటారట! అంచాత తను సరదాలకూ, వాటికీ దూరంగా ఉంటాట్ట. పోనీ, ఉంచమని ఏదన్న ఇచ్చినా పుచ్చుకోడు. 'తన మీద ఖర్చు చేసిన ప్రతి పైసా వృథా' అంటూండే వాడు.

—తనెన్నోసార్లు ఒంటరిగా, అతని గది కెళ్లింది. ఓమూల స్టౌ, గిన్నెలు, చెంచాలు, ఇంకో మూల, ఉతికి ఆర వేసుకున్న గుడ్డలు, మంచం కింద ట్రంకుపెట్టె, ఆ ప్రక్కనే చీపుర్లు, చేటలు—ఇలా ఉండేది గది! తను ఇంటికి రమ్మన్నది! 'ఊ' ననడు. పోనీ 'కాద'నైనా అనడు. 'చూదాం' అంటాడు. అంతకుమించి మరో మాట అతని నోటంట చెప్పించడం తనవల్ల కాలేదు.

అమ్మకయితే ఇష్టంలేదు గానీ నాన్న 'సరే' నన్నాడు. 'డబ్బు పెట్టి మనుషుల్ని కొంటాంగాని మనసుల్నెక్కడ కొంటామమ్మా?' అనేవాడు నాన్న. కాంతం లాంటి వాడు అంత మంచివాడు కాస్త కలిగిన కుటుంబాల్లో ఉండేందుకు అవకాశంలేదని, నాన్న సిద్ధాంతం!

ఇంత సులభంగా ఈ సమస్య పరిష్కారమవుతుందని తనూ అనుకోలేదు. ఈవార్త కాంతం చెవిన వేశామనీ, అప్పుడతని ముఖం ఎలా మారుతుందో చూడాలనీ తనకు అనిపించింది! తను వెళ్లేసరికి కాంతం, కంది పచ్చడి రుబ్బుతున్నాడు. తనను చూసి నవ్వి, చేతులు కడుక్కొచ్చాడు. తను చిన్నగా అసలు విషయం బైటపెట్టింది. ముందుగా కాంతం నవ్వలేదు. యథాప్రకారం నత్తలాగా ముడుచుకుపోయి, మూతిని సున్నాలా బిగించి, చూపుల్ని అంతర్ముఖం చేసి అలా అయిపోయాడు. తను నిజమే నన్నది! 'నాన్న రమ్మంటున్నా' రనీ అన్నది. 'పోనీ బ్రతిమిలాడించుకో దలిస్తే నాన్నే వస్తా' రని కూడా అన్నది.

అతను ఒక్కసారి చలించిపోయాడు. కళ్లింత చేసుకొని తనకేసి చూశాడు. ఆ చూపుల్లో ఏమున్నదో తను చదువుకోలేకపోయింది. రవంత సేపయాక—

''పద. వస్తాను'' అన్నాడు.

అంతే!

అదే ఆఖరి మాటవుతుందనిగానీ, అదే చివరి చూపవుతుందనిగాని తను అనుకోలేదు. అతని కోసం ఆ క్షణం నుండీ తను ఎదురు చూస్తూనే ఉన్నది! అప్పటికీ ఇప్పటికీ, అతను రాలేదు, తను చూడనూ లేదు.

ఈలోగా, జరగవలసినవన్నీ జరిగిపోయాయి. అమ్మ దాటిపోయింది. నాన్న జబ్బున పడ్డాడు. ఆ వ్యాధితో నాన్న పడుతున్న బాధ చూశాకే, తను డాక్టరీ చదువును ప్రారంభించింది. తను—ప్రాక్టీస్ చేయడం—నాన్న కళ్లారా చూడనేలేదు.

ఆ ఇంత కాలంలోనూ, మూరేళ్ల బ్రతుకు తను వెళ్లబోసింది. జీవితంతో, తను కావాలనుకొన్న దొకటైతే, తనకు లభించింది మరొకటి! ఈ ఉన్నదానితో తనెందుకు రాజీ పడిందన్న ప్రశ్నకు, జవాబు చెప్పుకోలేదు.

'జీవితానికి అర్థంలేదు'

అదొక్కటే జవాబు.

కాకపోతే—

సుమతి చటుక్కున తలెత్తి చూసింది! వాకిలి ముందొక రిక్షా ఆగి ఉంది. అందులోంచి ఓ అస్థిపంజరాన్ని, రిక్షావాడూ, మరో అస్థిపంజరమూ, కిందికి దించుతున్నారు. సుమతి స్ప్రింగ్ డోర్సును తెరిచి ఉంచింది. ముగ్గురూ, హాల్లోకి వచ్చారు.

అస్థిపంజరం బల్ల మీద కూచోలేక తూలిపోతుంటే, పడుకోబెట్టమన్నది! తల దగ్గర, అస్థిపంజరం వెంట వచ్చినావిడ మరో పుడక—గుడ్డ నీరు గుడ్డ కుక్కుకొంటూ కూచున్నది.

''ఏమిటి?'' అంటూనే, స్టెతస్కోపు తీసింది సుమతి.

''అన్నయ్యకు—''

సుమతి నిలువునా చలించిపోయింది. చేతుల్లో స్టెతస్కోపు నిలవలేదు. మైకం కమ్మిన దానిలాగా ఊగిసలాడిపోతూ, అదే బల్ల మీదికి జారగిలబడిపోయింది. కళ్లు మూసుకుపోయాయి. కనురెప్పల్ని తొలుచుకొని, నీటి జాలులు, చెక్కిళ్ల మీదుగా, కిందికి జారుతున్నాయి; పెదవులు, అస్పష్టంగా, బాధగా, గొణుగుతున్నాయి. మధ్య మధ్య, అంతరాంతరాల్లోని ఏదో బాధను, అపనయించుకొంటున్నట్లు సన్ననిమూలుగు—

రోగి కళ్లు మూసుకొని, అదేపనిగా, రొప్పుతున్నాడు.

చెల్లెలు చెబుతున్నది.

''నిన్నటిదీ మొన్నటిదీ కాదండీ! ఎన్నో ఏళ్ల నుండీ అన్నయ్యకీ జబ్బున్నది.. అయినా చెప్పాడుకాదు... చెప్పినా చేయగలిగిందేమీ లేదనుకోండి.. అదేదో శాపం పెట్టినట్లుగా, మాతాత, నాన్న, అన్నయ్యా అందర్నీ పీల్చిగుల్లచేస్తూనే ఉన్నదమ్మా! మీరు

# చరమ గీతి

ఈ జబ్బుతో స్పెషలిస్టులని విన్నాను. అన్నయ్యను తీసుకొచ్చాను.''

ఇంకెవ్వరూ లేకపోతే, సుమతి భోరు మని, గుండెలు బాదుకొని ఏడ్చి ఉండేది. ఆధునిక నాగరికత, ఆవిడకీ అవకాశం లేకుండా చేసింది!

చాలాసేపు, సుమతి ఏమీ మాట్లాడ లేదు. పొంగి పొంగి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోవడం, రానురాను అసాధ్య మవుతున్నది. రవంత సేపు కళ్ళు మూసుకొన్నది. వణికి పోతున్న పెదవులను ప్రయత్నపూర్వకంగా బిగబట్టింది. సన్నగా నిట్టూర్చింది!

''నువ్విక్కడే ఉండమ్మా! పరీక్ష చేసి చెబుతాను.''

చెల్లెలు, రెండు చేతులూ ఎత్తి సుమ తికి నమస్కరించింది.

''దిక్కులేని వాళ్లం డాక్టరమ్మగారూ! ఏంచేసినా మీదే భారం!''

రోగిని లేపి కూచోబెట్టింది సుమతి. అతనో సారి కళ్ళు విప్పి, డాక్టరున్న చూశాడు. ఆ క్షణకాలంలో, అతని, కళ్ళల్లో, ఏదో మసక మసగ్గా, సన్నని వెలుగు మెరిసి, మాయమయింది. రోగి పెదవులు, నీరసంగా, గొణిగాయి.

అతన్ని లేపి నిలుచోబెట్టింది సుమతి. తూలకుండా, దగ్గరగా ఆనుకొని, ప్రక్కనే ఉన్న గదిలోకి తీసుకుపోయింది.

ఓ నిమిషం తరువాత తలుపులు మూసు కొన్నాయి.

కాస్సేపయ్యాక—

చిన్నమూలుగు, దబదబమన్న చప్పుడూ వినిపించి—

చెల్లెలు తలుపు తీసింది ఆత్రంగా.

అన్నయ్య, నిర్జీవంగా, తెల్లని పక్క మీద పడుకొని ఉన్నాడు.

సుమతి, పాలరాతి గచ్చు మీద, బోరగిల పడి ఉంది!

ఆమె కల్లంత దూర్లంలో, పసుపుపచ్చని మందుసీసా, ఈ భీకర దృశ్యానికి, సాక్షి భూతంగా నిలిచి ఉంది!

# అందరి సొగసు గలిగించే-పదార్థం జి 11 హెక్సాక్లోరోఫిన మరియు దాని తాజా సువాసనయేగాకుండా సింథాల్‌కు ఎంతో ప్రత్యేకతను సమకూర్చింది ఏది ?



# తక్కువ ఖర్చు!

సింథాల్ చాలా కాలం నిలవుంటుంది. ఎందుకనగా అది విశిష్టంగా నిర్మించ బడింది. అందరి మితమైన తేమ అది వాని కరిగిపోకుండా నిరోధిస్తుంది.




సింథాల్ దుర్గంధ నిరోధకమైన దివ్యమగు సబ్బు. జి-11 (హెక్సాక్లోరోఫీన్) మురికి మరియు చెమట వల్ల ఉద్భవించే క్రిములను నిర్మూలిస్తుంది. శరీర దుర్గంధమును తొలగిస్తుంది.

మరి ఖచ్చితమైన నమ్మకతో-రోజల్లా హాయిగొలిపే పరిశుభ్రంగా నుండుటకు జి-11 (హెక్సాక్లోరోఫీన్) గల సింథాల్ సబ్బును మరియు సింథాల్ టాయిలెట్ పౌడరును వాడండి.

జి-11, ఎల్. జివొడా ఎట్. పి. ఎస్. ఎ. వారి ట్రేడ్ మార్కు





# అంతస్థులు అభిమానాలు

ఉన్నవ విజయలక్ష్మి

### జరిగిన కథ

స్కూలు ఫైనలు పరీక్షలకు ఇన్విజిలేటర్‌గా వచ్చిన సారథి, పరీక్షరాస్తున్న ఇందిరను ఆకర్షించాడు. ఫలితంగా వాళ్లిద్దరికీ పెళ్లయింది. భర్తతో పాటు కాపురానికెళ్లిన ఇందిర కొద్దికాలంలోనే సీమంతానికని పుట్టింటికొచ్చింది. సెలవుల్లో సారథి కూడా అత్తవారింటికి వచ్చాడు.

## 3

ఓ ఉదయం సారథి ఇంకా నిద్ర లేవకుండానే, చిట్టి మరదలు లీల వచ్చి రెండు చేతులతోనూ అతనిని కుదిపేస్తూ, "లే బావా, చిన్నక్కకి బుల్లి పాపాయి పుట్టాడు. పెద్దక్క పాపాయి కంటే బాగున్నాడు" అంది. నాలుగు రోజుల ముందు పుట్టిన సావిత్రి కొడుకుతో వీడిని పోల్చి చెప్పేస్తోంది అది అప్పుడే.

సారథి వులిక్కిపడి లేచి కూర్చుని, అంత శుభవార్త అందించినందుకు సంతోషం పట్టలేక బహుమానంగా దాని రెండు బుగ్గల మీద ముద్దు పెట్టేసుకుని, "వెళ్లి చూద్దాం రా" అంటూ దాని చెయ్యి పట్టుకుని ఆత్రంగా ఆ గది వేపు వెళ్లబోతుంటే,

"ఏమిటి బావా ఆ ఖంగారు? శాంతి చేసుకునే దాకా నువ్వు చూడకూడదు." అన్నాడు సూర్యం నవ్వుతూ.

ఉత్సాహం అంతా నీళ్లు కారిపోయి, తెల్ల మొహం వేశాడు సారథి.

ఆ సమయంలో ఇంట్లో సాయంగా ఉండడానికి వచ్చిన దూరపు బంధువు సుందరమ్మ గారు, కాఫీ కలుపుతూ, "అన్నయ్య అప్పుడే పంచాంగం చూశాడు, శాంతి లేదుట— అయినా ఇంకా నీళ్లు అవి పొయ్యాలి. ఈ లోగా మీరు మొహం కడుక్కుని కాఫీ త్రాగండి." అంది.

ఆ ఖబుర్లన్నీ ఇంకా చిలవలూ పలవలూ కల్పించి చెప్తూ లలిత విరగబడి నవ్వుతూంటే అలసటగా పడుకున్న ఇందిర వాలిపోయిన చెక్కిళ్లలోకి ఒక్కసారిగా రక్తం పొంగి వచ్చినట్లయింది. లలిత ఖబుర్లకి ముసి ముసిగా నవ్వుతున్న తల్లి మొహం చూడలేక కళ్లు వాల్చేసుకుంది.

కొడుకుని చూసిన సారథి సంతోషంతో గంతులు వేసినంత పని చేశాడు. వాడు మాట్లాడలేకపోయినా కనీసం ఏడుపయినా విందామన్నట్లు, "ఇంకా ఎంత సేపు పడుకుంటాడు. అసలు ఏడుపే వినిపించలేదు" అంటూ అది వినడానికి కాచుకుని కూర్చున్నాడు. ఇంట్లో వాళ్లు 'వూ' అంటే ఆ పసివాడిని బుజాన వేసుకుని వూరంతా తిరిగి వచ్చేయాలన్నట్లుంది అతని ఆరాటం.

"బాలసారె, నామకరణం వేడుక లేవీ అతనికి నచ్చవుట. పాత ఆచారాలు అతని కేమీ ఇష్టం వుండవుట. పేరు కూడ ఏ కొత్తరకందో ఎంచి పెడతాడేమో" అని ఇరుగూ పొరుగూలకి చెప్తున్న కామేశ్వరమ్మగారి వూహాలని తల క్రిందులు చేస్తూ తండ్రియందు తనకిగల అభిమానం గౌరవం వ్యక్తం చేస్తూ ఆయన పేరే కొడుక్కి స్థిరం చేశాడు సారథి. చిన్న శేషగిరి ముద్దుగా గిరిబాబు అయ్యాడు. మరో కొద్ది రోజులు వుండి స్కూలు తెరిచేనాటికి వెళ్లిపోయాడు సారథి. తరువాత పిల్లవాడిని తీసుకుని ఇందిర కూడా వెళ్లిపోయింది.

ఇంట్లో పనిపాటలు పసివాడి పోషణ అన్ని బాధ్యతలున్నా ఆమె చదువుకి మాత్రం ఏలాంటి అంతరాయం కలుగ లేదు. ఆమె అకుంఠిత దీక్ష భర్త ప్రోత్సాహ సహకారాలతో మంచి మార్కులతో ప్యాసయింది. ఫలితాలు తెలిసినవాడు ఇందిర కంటె మిన్నగా సంతోషించాడు సారథి.

"ఇప్పుడైనా నీకు కావలసింది అడుగు. సంతోషంగా ప్రెజెంట్ చేస్తాను." అన్నాడు ఆపేక్షగా ఆమె కళ్లల్లోకి చూస్తూ.

"మామూలే. బి. ఏ., పుస్తకాలు." అంది ఇందిర నవ్వుతూ.

తరువాత కొన్నాళ్లకి ఆవూరు వచ్చిన సూర్యం, "ఆ ఒక్క పార్టు నా ప్రాణాలు తీస్తోంది. ఈ సెప్టెంబరు మార్చిలలో కూడ ప్యాసుకాకపోతే నేనింక పరీక్షకి వెళ్లను. నా కళ్లముందు పుట్టిన దానిని చకచకా ప్యాసయిపోతుంటే నేను తప్పానని చెప్పుకోడం కంటె అవమానం మరొకటి లేదు" అన్నాడు.

"మీ చెల్లాయి మీతో పోటీకి రావడానికి యింకా రెండేళ్లుందిగా. బాగా చదివి పై సెప్టెంబరుకే వెళ్లండి ఏకంగా." అన్నాడు సారథి నవ్వుతూ.

"ఏం అక్కర్లేదు. రేపు సెప్టెంబరులో నువ్వు తప్పకుండా ప్యాసయిపోతావన్నయ్యా. నేను చెప్తున్నాను చూడు." అంది ఇందిర.

ఇందిర నోటి చలవ అయితేనేం, అదృష్టం కలిసి వస్తేనేం, అన్నింటిని మించి అతను శ్రద్ధ తీసుకుని చదివితేనేం, ఆ సెప్టెంబరు పరీక్షలలోనే సూర్యం గ్రాడ్యుయేట్ అనిపించుకునే అర్హత సంపాదించుకున్నాడు. అట్టే శ్రమ పడక్కర లేకుండా వాళ్ల వూళ్లోనే చిన్న వుద్యోగం కూడా దొరికింది. ఈ అన్ని అదృష్టాలతో పాటు అతనికి కల్యాణ యోగం కూడ కలిసి వచ్చింది.

ఆ పెళ్లికి వెళ్లిన ఇందిరకి, రెండేళ్ల కృష్ణుడిని చంకని వేసుకుని భారంగా తిరుగుతున్న నిండు చూలాలు సావిత్రిని చూస్తే జాలేసేది. ఒక్క సావిత్రే కాదు పెళ్లికి వచ్చిన మిగతా బంధువులలోనూ ఆడ పెళ్లివారింట్లోనూ అలాంటి వాళ్లు చాల మంది వున్నారు 'పరిమితం కుటుంబం యొక్క ఆవశ్యకతని గుర్తించే చైతన్యం ప్రజలలో కలగడానికి ఇంకా ఎంత కాలం పడుతుందో. ఎంతయినా మరీ ఏటా కాన్పు

అయితే అప్పుడే తెలుస్తుంది (?) బాగుం టుంది. పుట్టే పిల్లలు ఎంత బలంగా వుంటారు అనే విషయం అయినా ఆలో చించుకోకపోతే ఎలా అని సీదరించుకుంది. మధ్యాహ్నం ఆడవాళ్ళు అంతా కూర్చుని ఖబుర్లు చెప్పు కుంటున్నప్పుడు తన తోటిదే అయిన మాలతితో చనువుగా ఆ మాటే అంది. ఏడాది పిల్లవాడిని కాళ్ళ మీద పడుకోబెట్టుకుని జోకొడుతున్న ఆ అమ్మాయి వులిక్కిపడి, "నా సంగతి ఇంకా ఈ అమ్మాయి దాకా వచ్చినట్లు లేదు" అనుకొని నవ్వుకొంది.

వీళ్ళ మాటలు వింటున్న వో పెద్ద ముత్తయిదువ, "అందరూ నీలా చదువు కున్న వాళ్ళు కాదుగా మరి, అన్ని విషయాలు తెలుసుకోడానికి." అంది వెటకారంగా దీర్ఘం తీస్తూ.

మిగతా అందరూ ఫక్కు మనటంతో ఉక్రోషం వచ్చిన ఇందిర, ఉద్రేకంగా, "దీనికి చదువు అవసరం ఏంలేదు. అక్షర జ్ఞానం లేని వాళ్ళకి కూడ అన్ని విషయాలు తెలియ జెప్పే ఆస్పత్రులు వున్నాయి. ఆ జ్ఞానం మనలో వుండాలి కాని." అని తకీమని సమాధానం చెప్పేసింది.

"అయ్యో, విడ్డూరమా." అంటూ బుగ్గలు అరంగుళం లోతుకు పోయేలా నొక్కేసుకున్నారు అమ్మలక్కలు.

ఇంక అక్కడ కూర్చోలేక ప్రక్క గది లోకి వెళ్ళిపోయి కొడుకు ప్రక్కనే చోటు చేసుకుని నడుం వాల్చింది.

సూర్యం పెళ్ళి వార్షికోత్సవం. ఇందిర బి. ఏ. రిజల్ట్సు ఒక్కనాడే వచ్చాయి. ఇంత అవలీలగా పరీక్షలు ప్యాసయిపోతు న్నందుకు ఆనందం ఆశ్చర్యం కూడా ఉక్కిరిబిక్కిరి చేసేస్తూంటే ఏ పని చేయాలనుకున్నా అదృష్టం కూడ కలసి రావాలి. లేకపోతే కష్టపడి రాత్రింబగళ్ళు చదివినా పరీక్ష తప్పిన వాళ్ళని ఎంతమందిని చూడటం లేదు, అనుకుంది ఇందిర. ఇంక సారథి సంతోషం చెప్పక్కర్లేదు.

సారథి ప్రియ శిష్యురాలు, ఆ వేళే స్కూలు ఫైనల్ పూర్తి చేసిన స్వర్ణ తన పెళ్ళి శుభలేఖ ఇవ్వటానికి వచ్చి క్లాసులో అంత ముభావంగా గంభీరంగా వుండే మాష్టారు ఇంట్లో పసివాడిలా గంతులు వేస్తూ సరదాగా వుండటం చూసి ఆశ్చర్య పోయింది. ఆ సంతోషానికి కారణం తెలుసుకున్నాక [illegible] — [illegible]



ఇంక చదవటం సాధ్యం కాదు. పిటికయితే మన ఊళ్ళో కాలేజీ లేకపోయినా దగ్గరలో వున్న సెంటరుకి కట్టు గరిగాను. దాని కయినా ఎంత ఇబ్బంది అయిందని. ఇంక ఎమ్.ఏ. కి ఏ నాగపూర్ వెళ్ళడం పరీక వ్రాయటం అంతా జరగని విషయం— [illegible] పెళ్ళి పెళ్ళి అని తొందరపడిపోయారు" అంది స్వర్ణ బుంగ మూతిపెట్టి.

"నేను మాత్రం పెళ్ళి అయాక చదువు కోలేదూ. నువ్వూ అలాగే చదవచ్చు. చాలా ప్రయివేటుగా చదవాలన్న బాధ కూడాలేదు. హాయిగా కాలేజీలోనే చేరొచ్చు." అంది ఇందిర.

"ఏముంది. మరో రెండేళ్ళు పోతే చక్కగా ఎమ్. ఏ., అయిపోతారు. అదృష్టవంతులు" అంది, ఏమంటారు అన్నట్లు సారథివంక చూస్తూ.

"అవును. అది ఎప్పుడో అనుకున్నదే." అన్నాడు సారథి సంతోషంగా.

"ఆ. అప్పుడేదో అనుకున్నాం గాని అనేసింది ఇందిర.

"అదేం కుదరదు. కాశీ వ్రాసి పుస్తకాలు తెప్పించేస్తాను." అన్నాడు సారథి బెదిరిస్తు న్నట్లు.

"ఆయనంత ప్రోత్సాహం ఇస్తున్నప్పుడు చదువుకో డానికేమండి— నాకూ ఇంకా ఎంతో చదువుకోవాలని వుంది. మా వాళ్ళు

"…నరేలెండి. అందరూ మాష్టారంత మంచి వాళ్ళే వుంటారా?" అంది స్వర్ణ.

"ఆ మాట ఇంకోసారి చెప్పు స్వర్ణా. నేను సరిగ్గా వినలేదు" అన్నాడు సారధి.

"అది మీ మంచితనం కాదు, నా అదృష్టం." అంది ఇందిర.

ముగ్గురూ నవ్వుకుంటూ వుంటే, గిరి బాబు ఆటసామాన్ల లోంచి తల ఎత్తి, తనూ నవ్వాడు అర్థం కాకపోయినా.

కాస్సేపు కూర్చుని కాఫీ ఫలహారం తీసుకుని, తన పెళ్ళికి రావలసిందిగా మరీ మరీ చెప్పి వెళ్ళిపోయింది స్వర్ణ.

ఆమె వెళ్ళిపోగానే సారధి మళ్ళీ చదువు ప్రసక్తి తీసుకు వచ్చాడు.

"నిజంగానే చెప్తున్నాను. నాకింకా చదువుకోవాలని లేదు. మీకు అభ్యంతరం లేకపోతే నేను కూడ ఏదైనా ఉద్యోగంలో చేరతాను. బాబుని చూడ్డానికి ఎవరైనా పెడదాం. ఇంకో ఏడు పోతే వాణ్ణి స్కూల్లో చేర్పించేయొచ్చు." అంది ఇందిర.

"భార్యని పిల్లవాడిని పోషించుకోలేని అప్రయోజకుడినని నలుగురి చేతా అనిపించుకోవాలా నేను. ఎవరి దాకానో అక్కర్లేదు, మీ నాన్నగారే అడుగుతారు మా అమ్మాయి కష్టపడి సంపాదిస్తే కాని సంసారం గడవని స్థితికి వచ్చిందా అని" అన్నాడు సారధి చిన్నగా నవ్వుతూ.

కాని ఇందిర నవ్వలేక పోయింది. "మీకు అలాంటి అభిప్రాయాలున్నాయని నేననుకో లేదు. అందుకే చనువుగా అడిగేశాను. ఏమీ అనుకోకండి." అంది చిన్నబుచ్చుకున్నట్లు.

"నవ్వుతూ అన్న దానికి కూడ కోపం వచ్చేసింది కదూ నీకు— ఆడవాళ్ళు ఉద్యోగము చెయ్యటం గురించి నాకెలాంటి దురభిప్రాయం లేదు. కాగా మొగవాడి సంపాదనతో ఇల్లు గడవడం కష్టం అయినప్పుడు, నలుగురూ ఏమైనా అనుకుంటారని భయపడి గాని, అదేదో ప్రతిష్ఠకి భంగకరం అనే లేనిపోని అభిమానంతో కాని ఇంట్లోనే మగ్గిపోయే బదులు ధైర్యంగా చేతనయిన పని చేసి స్త్రీ కూడా ఆ కుటుంబభారాన్ని పంచుకోవడాన్ని నేనెంతో మెచ్చుకుంటాను. తిని తినకా పస్తులుండటం కన్నా, అప్పు చేసుకుని తినటంకన్నా ఇది ఎంతో ఉత్తమం. ఇక నీ విషయంలో నేను చాల పెద్ద ఆశలు పెట్టుకున్నాను. అది తీరిందంటే నువ్వు

అంతే స్త్రీలు -

అభిమానాలు

పోయినా లెక్చరర్‌వి కావచ్చు."

"అయితే మీరు కూడా నాతోపాటు చదవాలి." ఏమిటన్నట్లు చూశాడు సారధి.

"నాతో పాటు మీరు కూడ చదవాలి." అంటూ భర్త కళ్ళల్లోకి చూసింది.

వెళ్ళబోయాడు సారధి. "మళ్ళీ ఇదేమిటి? నా కలాంటి సరదాలేం లేవని చెప్పానుగా."

"మీకు లేకపోయినా నాకుంది. మీరు టీచర్‌గా వుంటే, నేను లెక్చరర్‌ని కావటం, అందుకు మీరు సంతోషంగా ఆమోదించటం మీ మంచితనాన్ని, విశాల దృక్పధాన్ని వెల్లడిస్తాయేమో కాని అది నాకెంతమాత్రం సమ్మతం కాదు. మీరు కూడా చదువుతానంటేనే నేను ఒప్పుకుంటాను. లేకపోతే నాకీ డిగ్రీ చాలు. మీరు తెచ్చే జీతం మనకి చాలు."

"ఏమిటో ఇదో కొత్త పేచీ తెచ్చావు. అయినా నేను సైన్సు వాడిని. ఇప్పుడు నీతోపాటు చరిత్ర బట్టీపట్టటం నావల్ల ఏమవుతుంది?"

"అయితే కాలేజీలో చేరి సైన్సే చదవండి." అతను కాస్త మెత్తబడుతున్నాడని గ్రహించిన ఇందిర మరికొంచెం ధైర్యం చేసింది.

"సరిపోయింది— వ్యవహారం మళ్ళీ మొదటికి రాదూ— అందుకే నువ్వు లెక్చరర్‌వి అయి నన్ను చదివించు."

"ఆ పని ఇప్పుడే చేద్దాం."

"అబ్బ. చెప్పిన మాట కాస్త వినదూ. ఇప్పుడు వున్న పళంగా నీకు ఉద్యోగం ఇక్కడ దొరుకుతుంది. మనం ప్రయత్నం చేస్తుండగానే ఆ ఏడు చదువే అయిపోతుంది. అయినా ఉత్సాహంగా సాగిపోతున్న చదువుని మధ్యలో ఆపకూ— తరువాత నేను సెలవు పెట్టి తప్పకుండా చదువుకుంటాను. నామాట నమ్ము. అనుకోకుండా వచ్చిన అవకాశం నేను మాత్రం వదులుకుంటానా."—

అంత బలవంతం మీద మొదలు పెట్టిన చదువుకి మధ్యలోనే అంతరాయం వచ్చింది.

"నీ ఆరోగ్యం జాగ్రత్త. బాబు జాగ్రత్త. రెండేసి రోజులకో వుత్తరం వ్రాస్తుండు" అని శాంతి అప్పగింతలు పెడుతూ బాబ మరిది వెంట భార్యని కొడుకుని రైలు ఎక్కించిన సారధి మనస్సు కూడ వాళ్ళతో పాటే వెళ్ళిపోయింది. బాధ్యత తీర్చుకోటానికి స్కూలుకి వెళ్ళి వస్తున్నాడే కాని అతని ధ్యాసంతా అందుకోబోయే టెలిగ్రాం మీదే వుంది.

శుభ వార్తని మోసుకు వచ్చిన టెలిగ్రాం చూసుకోగానే, అతి ప్రయత్నం మీద నాలుగు రోజులు శలవు సంపాదించి రైలు ఎక్కాడు.

అమాయకంగా కళ్ళు మూసుకుని పడుకుని మధ్యమధ్య తనలో తనే నవ్వుకుంటున్న పసి పాపని చూసి మురిసిపోతూ, "పాప అచ్చం నాలాగే వుంది కదూ. బాబు నీ పోలిక. మన పిల్లలిద్దరూ అదృష్టవంతులే." అన్నాడు సారధి.

"అవును. మనకి అదృష్టం కాబ ఇంక." కళ్ళు వాల్చుకుని సిగ్గుపడుతూనే సమాధానం చెప్పింది.

"అవును నిజమే. ఇంక మన చదువుకి ఎలాంటి అంతరాయం రాకూడదు—" నవ్వాడు సారధి.

అతనికి కాఫీ ఫలహారం ఆ గదిలోకే తెచ్చిన మరదళ్ళు, "పాప పేరేమిటి బావా, చక్కటి పేరు పెట్టాలి మరి." అన్నారు ఇటూ అటూ చేరి.

"మీరే చెప్పండి."

పాపం వాళ్ళ ఆలోచన తెగక ముందే, "మీకు చెప్పటం మరిచి పోయాను— పద్మ కలిసేలా రావాలి." అన్నాడు.

"ఏం. పద్మావతి నచ్చలేదా ఏమిటి మీకు. కొత్త మార్చాలని చూస్తున్నారు." అంది ఇందిర నవ్వుతూ.

"నీ ఇష్టం."

"పూహా. పద్మ, పద్మలత బాగుంటుంది." అంది లలిత.

"మా క్లాసులో పద్మజ అనే అమ్మాయి వుంది." అంది లీల ఆ పేరు బాగుంది అన్నట్లు.

"పద్మప్రియ బాగుంటుంది కదూ." అంది ఇందిర—

సారధి వొళ్ళ స్టూడెంటు ఒకతను కొత్తగా ఫోటో స్టూడియో పెట్టాడు. ఇందిరా పిల్లలూ వచ్చారని తెలిసి, "మీ ఫామిలీ ఫోటోలు తీస్తానుసార్." అంటూ

మేరా పట్టుకొచ్చాడు ఓ ఉదయం.

"నిజమే. స్టూడియోకివెళ్ళి తీయించుకోవాలంటే ఎప్పటి కప్పుడే అశ్రద్ధ అయిపోతుంది. పాపకి విడిగా ఒకటి తీయించాలి" అంటూ ముస్తాబుకావటం మొదలపెట్టింది ఇందిర.

వీళ్ళు అనుకున్నవేకాకుండా, మీ ఇద్దరికీ కలిపి ఒకటి, పిల్లలిద్దరికీ ఒకటి అంటూ సరదాగా నాలుగైదు రకాలు తీశాడు అతను.

ఓ వారం రోజులుండి కూతురికి అన్నీ అమర్చి ఇంక రేపు వెళ్ళిపోతానని ప్రయాణం అయింది కామేశ్వరమ్మగారు.

కాని ఆరాత్రి వళ్ళు నెప్పులు, తలనెప్పి అని పడుకున్న సారధికి తెల్లవారేసరికి జ్వరంకూడ తగిలింది.

"ఇవాళేం వెళ్తావు. మరో నాలుగురోజులుండు బాబూ" అంది ఇందిర దిగులుగా.

"అలాగేలే. అతనికి జ్వరం తగ్గాకే వెళ్తాను—గాలి మార్పుకి వచ్చింది. రేపటికి తగ్గిపోతుంది" అని ప్రయాణం వాయిదా వేసుకుంది ఆవిడ.

వారం గడిచినా జ్వరం తగ్గే సూచనలేమీ కనిపించలేదు సరికదా, మధ్య మధ్య పరాకు మాటలు మగతగా కళ్ళుమూసుకుని పడుకోడంలాంటి అవగుణాలు కనిపించసాగాయి. ఇందిర, కామేశ్వరమ్మగారు భయపడి ఇంటికి టెలిగ్రాం ఇవ్వాలనుకున్నారు. మొగవాళ్ళెవరైనావుంటే బాగుంటుందని డాక్టరు కూడ సలహా యిచ్చాడు. అది అందుకుంటూనే పరుగెత్తుకు వచ్చారు వైకుంఠంగారు. ఆయన వచ్చిన నాలుగు రోజులదాకా సారధి పరిస్థితి అలాగే చెరువూ మరువూ గావుంది.

కాస్త తెలివిగా ఉన్నప్పుడు ఓసారి, ఇందిరని మంచంమీద కూర్చోపెట్టుకుని,

"పిల్లలకి నువ్వు వున్నావు. నీకే ఎవరూ లేకుండా అయిపోయింది" అన్నాడు హీనస్వరంతో.

ఇందిర గుండె చెరువయిపోయింది. ఎలాగో గొంతు పెగల్చుకుని, "నాకు మీరున్నారు. నాకేం భయంలేదు" అంది. తరువాత వెక్కిళ్ళు అడ్డుపడి మాటరాలేదు. మవ్వంగా తలతిప్పి కాలవలు కడుతున్న కన్నీటిని తుడుచుకోబోయింది. శుష్కించిపోయిన రెండు చేతులలోకి ఆమె కళ్ళలోకిచూస్తూ "ఇలా ఏడ్చినందువల్ల ఏం ప్రయోజనం లేదు ఇందూ. నువ్వు ధైర్యంగాఉండాలి—మీకు నేను మిగిల్చిపోతున్న ఆధారంకూడ ఏమీలేదు" అన్నాడు విషాదంగా. చటుక్కున అతని రెండు చేతులలోనూ మొహం దాచుకుని, ఉప్పెనలా వస్తున్న దుఃఖాన్ని నిట్టూర్పులతోనే దిగమింగడానికి ప్రయత్నిస్తూ మౌనంగానే కూర్చుంది ఇందిర.

"మీకేం భయంలేదని చెప్పానుకదూ. డాక్టరుగారుకూడ ధైర్యం చెప్తున్నారు—మీరింకేం ఆలోచించకండి" అంది. కొంతసేపటి తరువాత, ఓ శుష్కహాసం అతని పెదవులమీద మెరిసి మాయమయింది. చాలసేపు అలా భార్యచేతిని నిమురుతూ, చివరికి ఆ చేతిని తన రెండు చేతులతోటి గట్టిగా పట్టుకుని గుండెలమీద అన్చుకుని నిద్రపోయాడు.

తనని అన్యాయం చెయ్యవద్దని తనకి తెలిసిన దేవతలందరికీ మొరపెట్టుకుంది ఇందిర. ఇరుగు పొరుగు చెప్పిన ముడుపులన్నీ కట్టింది. కాని ఏ దేవతలూ కరుణించలేదు. విధి క్రూరంగా వెక్కిరించింది. గెలుపు నాదే అంటూ ఖర్మఫలం వెన్నువిరుచుకుంటూ ముందుకివచ్చింది.

ప్రాణాధికంగా ప్రేమించిన భర్త శాశ్వత నిద్రలో మునిగిపోయాడని వినగానే ఇందిర పిచ్చిదానిలా తల మంచంపట్టెకి వేసి కొట్టుకుంది. "నేను నమ్మను. వారు నిద్రపోతున్నారు. కాస్సేపటికి లేస్తారు" అంటూ, అంతవరకు మినుకు మినుకుమంటున్న ఆశాదీపం పూర్తిగా ఆరిపోయిందనే సత్యాన్ని నమ్మలేక హృదయ విదారకంగా ఏడుస్తున్న కూతుర్ని కామేశ్వరమ్మగారు ఎలాగో పొదివి పట్టుకుని ఓదార్చబోయింది. కాని ఇంత అన్యాయాన్ని సహించమనిచెప్పడానికి నోరు రాక ఆమె కూడ కూతురితోపాటు ఏడుస్తూ కూర్చుంది.

ఇంట్లో ఉన్నంతసేపూ తండ్రిని వదలకుండా వెంట వెంటే తిరిగే గిరి, పూర్తిగా అర్థం కాకపోయినా తల్లి ఏడుపు చూసి బెదిరిపోయి తనూ ఏడుస్తూ తండ్రిని పిలుస్తూంటే చూసినవాళ్ళ కడుపులు తరుక్కుపోయింది. వైకుంఠంగారు బలవంతాన ఆ పిల్లవాడినితీసి భుజాన వేసుకున్నారు.

అభము శుభము తెలియని పద్మ ఏడుపు విని పొరుగమ్మ కాసిని పాలు కలిపి సీసా నోటికి అందిస్తే ఏడుపుమాని కళ్ళు మూసుకుని అమాయకంగా కడుపు నింపుకుంటోంది ఆ పాప.

ఖబురు వినగానే స్కూలుకి శలవ ఇచ్చేసి మాష్టర్లు, పిల్లలూ అందరూ బిలబిలలాడుతూ వచ్చారు. అక్కడిస్థితి చూసి జాలిపడుతూ కంట తడిపెట్టని విద్యార్థికాని మేష్టరుకాని లేడు. దుఃఖం ఆపుకోలేని కొందరు పిల్లలు మేష్టర్ని తలంచుకుని పైకే ఏడ్చేశారు. హెడ్మాష్టరు మెల్లిగా ఇందిర దగ్గరికివచ్చాడు—సారధి మంచితనాన్ని విపరీతంగా అభిమానించే ఆయన ఇందిరని, వాళ్ళ అన్యోన్య దాంపత్యాన్నిచూసి ఎంతో మురిసిపోయేవాడు. సారధి శ్రేయస్సు నిజంగా కోరేవారిలో ఆయన ఒకరు—"ఇంత కష్టం రావలసిన వయసు కాదమ్మా నీది. నీ పరిస్థితిని చూస్తున్న మాకే గుండెలు చెదిరిపోతున్నాయి. నీకేం చెప్పడానికి నోరురావటం లేదు—నువ్వుకాస్త ధైర్యం తెచ్చుకోవాలి. నువ్వు పెంచిపెద్ద చేయాల్సిన పసివాళ్ళు వున్నారు. వాళ్ళని చూసయినా నీ దుఃఖం మరిచిపోవాలి" అన్నారు ఉత్తరీయంతో కళ్ళు ఒత్తుకుంటూ......

ఎదురుగావున్న టేబిల్‌మీద రెండు మోచేతులూ ఆనించి, అరచేతులతో మొహం వుంచుకుని నీళ్ళు నిండినకళ్ళతో ఫోటోవంక చూస్తూకూర్చున్న ఇందిర బాధగా రెండు కళ్ళు మూసుకుంది. జలజల అశ్రువులు రాలిపోయాయి. చిన్నాభిన్నం అయిన హృదయాన్ని కూడదీసుకోడానికి ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్చి కొంగుతో కళ్ళు వత్తుకుంది. తుడిచిన కొద్దీ ఆగకుండా స్రవిస్తున్నాయి అశ్రువులు.

"అమ్మా" గిరి పిలుపు విని వులిక్కిపడి లేచి, గబగబ కళ్ళు తుడుచుకుని మనస్సు కుదుటబరుచుకొని తలుపు తీయడానికి వెళ్ళింది మెల్లిగా.

**(సశేషం)**

# ఆ మురికి ఫిల్టర్ ఇన్సర్టు మీకు ఎక్కువ లాభదాయకమైనది.

ASP/MICO/70



వాడిన మైకో ఫిల్టర్ ఇన్సర్టు వైపు చూడుడు. అది మురికితో కూడియుండుట సహజమే. కారణమేమనగా ఆయిల్‌లోని మురికిని వేరు పరచి ఫ్యూయల్ ఇన్జక్షన్ ఎక్విప్‌మెంటును భద్రముగాను, శుభ్రముగాను కాపాడును. పూర్తిగా మురికిని వేరుచేయు శక్తిగల అసలైన మైకో ఫిల్టర్ ఇన్సర్టులను వాడిన, మీకు రిపేరిఖర్చులు మరియు ఇంజన్ స్తంభించుటవలన కలిగెడి ధననష్టములను మిగల్చగలరు. డీసల్ ఇంజన్‌ల ఉత్పత్తిదారులు మైకో ఫిల్టర్ ఇన్సర్టులనే మూలోపకరణముగా వాడుచున్నారు. మీరు ఎల్లప్పుడు అసలైన మైకో ఫిల్టర్ ఇన్సర్టులనే వాడుటకు ఇది మంచి కారణము

## మైకో కృషి ఉత్తమ రహదారి ప్రయాణములకు

**MICO**

LICENCE **BOSCH**



మోటార్ ఇండస్ట్రీస్ కంపెని లిమిటెడ్, బెంగళూరు

అమ్మకకేంద్రాలు : బొంబాయి 18 - 78 డా. అనిబెసెంట్ రోడ్డు, వర్లి ■ కల్కత్తా-16, : 81 A పార్క్‌స్ట్రీట్ ■ మద్రాసు - 2 1/155 మౌంట్ రోడ్డు ■ న్యూఢిల్లి - 1 : మోతియాబాద్ ఇంజనీరింగుకంపెని (ప్రైవేట్) లిమిటెడ్ అసఫ్ అలీరోడ్డు ■

శ్రీమతి పంచాక్షరి

# భగవంతుడికొక ప్రార్థన

'ముందుగాతిన్న అమ్మ మొగుడాకలెరుగదు' వ్యాసం చదివాను. చక్కటి పేరు పెట్టినందుకు సోదరి సత్యవతిగారు అభినందనీయురాలు. అవును మరి! ఎంతసేపటికీ, తన పొట్ట, తన తిండి, తన ఊహలు మాత్రమే తెలిసిన అమ్మకు మొగుడి ఆకలి, ఎదుటి వారి భావాలు ఎలా అర్థమవుతాయ్?

నేను వ్రాసిన వ్యాసంలో 'ఈ రెండో కోణం నుంచి కూడా ఈ సమస్యను చూపడం నా ప్రధానోద్దేశ్యమని' ముందే పేర్కొన్నాను. సోదరి సత్యవతి నాభావాల్ని సహృదయంతో అర్థం చేసుకొని, ప్రస్తుత సంఘంలోని నిష్ఠుర నిజాల్ని సహనంగా భరిస్తారనుకొన్నాను. కానీ 'నిప్పు తొక్కిన' పామె తగా ఉన్న ఆమె వ్యాసాన్ని చూసి, ఏమనుకోవాలో నా కవగతం కాలేదు. ఏది ఏమైనా ఎంతో సహనంతో వ్రాసిన నా వ్యాసాన్ని, అందులోని నా భావాల్ని ఆమె పూర్తిగా అపార్థం చేసుకుని, మాటమాటకూ వ్యక్తి దూషణ చేస్తూ మరొక వ్యాసం వ్రాశారు. ఇక నిగ్రహం చూపాల్సిన అవసరం నాకు లేదు. నిగ్రహాన్ని అసమర్థతగా ఆమె భావిస్తారేమోననే అనుమానంతో, ఆమె చేసిన ఆరోపణలకు జవాబుగా నేనీ వ్యాసం వ్రాస్తున్నాను.

'ముందు తిన్న అమ్మ' వ్యాసం చదివిన తర్వాత, సత్యవతిగారి దురహంకారపూరిత వ్యక్తిదూషణకు బాధపడాలో, వాస్తవాలని కని, విని, భరించలేని ఆమె దుర్బలత్వానికి జాలిపడాలో నాకు తెలియటంలేదు. 'వనితాలోకం' శీర్షిక క్రింద వెలువడే వ్యాసాలు విజ్ఞానాత్మకంగా, నిత్యజీవితానికి ఉపయోగించేలా ఉండాలి. అలాకాక సాంఘిక సమస్య పేరుతో మొదలైన ఒకానొక అహంకార చిత్రణ, గుండె నిబ్బరంలేక చేసే బహిరంగ దూషణలతో, ఇంత అసహ్యంగ మారుతుందనుకోలేదు.

'వివేకం దాశ్యమనస్తత్వం' అన్న సత్యవతిగారి మనస్తత్వం ఎలాంటిదో ఈపాటికి పాఠకులందరికీ తెలిసే ఉంటుంది. వివేకం దాశ్యమనస్తత్వమైతే, అవివేకం, అజ్ఞానం, అహంకారం, పురోగమనానికి చిహ్నాలా? సత్యవతిగారు కోరే పురోగతికి, సమానతకు అర్థం, ఈ అవివేక, అహంకార, అజ్ఞానాంధకార సముపార్జనేనా? భగవాన్, సత్యవతిగారినీ, ఆవిడ లాంటి వారితో నిండిన దేశాన్నీ రక్షించే భారం నీదే!

పత్రికలో వ్యాసం వ్రాయడం సత్యాగ్రహమా? ఈ సత్యాగ్రహంతో పనులు సాధించాలా?— లేదు. ఇది సత్యాగ్రహం కాదు. ఈసుతో నిండిన, కడుపుమంటతో రేగిన ఒట్టి 'ఆగ్రహం' మాత్రమే. కుల సమస్యకు అంతమంటూ ఉందిగానీ, ఈ ఆగ్రహానికి అంతమెక్కడ?

'నేను విద్యావతినీ, మా తమ్ముడు సకల గుణాభిరాముడూ' అని మాటిమాటికీ సత్యవతిగారు చెప్పుకొన్నారుగానీ, హరిజనుల ఇంటికి భోజనానికి వెళ్లడం 'సంస్కారం'గా నేను చెప్పుకోలేదే! ఆవిడ అసమగ్రవగాహనకు ఇదొక నిదర్శనం.

వాళ్ల బాధలు తెలుసుకోవటానికి నేను 'పంచమకులం'లో పుట్టాలన్నారామె. అతి హేయమైన అవమానాల నెదుర్కొంటున్న ఆ కులంలో పుట్టి, హీనంగా చూపబడుతూ జీవితం వెళ్లబుచ్చుకోవడం, తోటి 'స్త్రీ'గా ఆమె కోరుతున్నారా? ఆమె స్త్రీ హృదయంలో పాటిస్త్రీ మంచిని, కనీసం, మాటల్లోనైనా, కోరే లాలిత్యం, సౌకుమార్యం కొరవడ్డాయా? తన మాటలు ఎటూ నిజంకావని తెలిసికూడా, ఆవిడ నిగ్రహాన్ని కోల్పోయారా? ఆవిడ చెప్పినట్లుగా 'జాత్యహంకారం' ఆవిడ లాంటి వారిలో మిగిలి ఉన్నంతవరకూ ఈ సమస్య పచ్చగా ఎదగటమేకాదు, విరగబూచి, కాయలు కాస్తుంది.

'బ్రామ్మలటగా' అన్న రావుగారి తల్లిగారి మాటలు, ఆవిడకు, నాగరిక పదజాలంలా, అసందర్భంగా తోచాయన్నారు. 'బ్రామ్మలు' అనే పదం ఆవిడకు నాగరిక పదమైతే, ఆవిడ విజ్ఞానానికి నా జోహార్లు. ఆవిడకో ప్రత్యేక నాగరికత ఉందేమో నాకు తెలియదుగానీ, మా నాగరికతలో 'బ్రాహ్మణులు' 'బ్రాహ్మలు' అనిమాత్రమే పిలుచుకొంటాం. 'బ్రామ్మలు' 'బాపనోళ్ళు' అని బాగా అభివృద్ధి చెందిన నాగరికతలో పిల్చుకొంటారేమో మరి నాగరికులు చెప్పాలి.

'అసందర్భ' ప్రసక్తి తెచ్చారు కాబట్టి, ఆవిడగారి మొదటి వ్యాసంలోని ఒక అసందర్భాన్ని గురించి చెప్పాలి. ఇది నేను ముందే గమనించినా, నా ప్రధానోద్దేశం, వ్యక్తిని విమర్శించడంకాదు కాబట్టి, నా మొదటి వ్యాసంలో పేర్కొనలేదు. జి. వ. చై. సతీమణిగారికి, సత్యవతిగారి శ్రీవారి వల్ల కొన్ని పనులు కావలసి ఉన్నాయని, ఆవిడే పేర్కొన్నారు. అలాంటప్పుడు, ఆ జి. వ. చై. సతీమణిగారు, హరిజనులను, సత్యవతిగారి ముందే అలా విమర్శించగలరా? (సత్యవతిగారు, హరిజనస్త్రీ, అని తెలిసి



కూడా తెలియనట్లుగా అయినా) ఇది అసందర్భం కాదా?!

ఆవిడతో ఒక విషయంలో నేనేకీభవిస్తున్నాను. రావుగారి తల్లిగారికి నచ్చచెప్పి, వారింట్లో మేము భోజనంచేసి రావలసిందే. కానీ అలా చేయకపోవడం, 'నిగ్రహం' కొరవడికాదు. రావుగారి అవస్థను చూడలేక, అక్కడే ఉండి ఆయన బాధను పెంచటం ఇష్టంలేకే, మేము తిరిగివచ్చింది. సత్యవతిగారితో కనీసం ఉత్తరం ద్వారానైనా మాట్లాడగలిగితే, మేము భోజనం చేసిన ఇళ్ళు, వ్యక్తుల గురించి ఆవిడకుపూర్తిగా నిదర్శనాలతో చెప్పగలను. ఇలాంటి విషయాలు పత్రికా ముఖంగా వెల్లడించి 'సంస్కార' వంతురాలినని, 'విప్లవకారిణి'ని అని, అందరి చేతా భావింపబడాలనే కోరిక నాకు మాత్రంలేదు. రావుగారి విషయమైనా, వ్యాసోద్దేశానికి అవసరం కాబట్టి చెప్పాల్సొచ్చింది. ఆవిడ చేసిన మరో ఆరోపణ, భోజనానికి పిలిచిన విషయం, ముందే రావుగారి తల్లిగారికి తెలిసి ఉండాలి గదా, ఇదెలా సంభవమని. రావుగారు మేము వస్తామో, రామో తెలియకుండా, ముందే ఇద్దరికి సరిపడా భోజనం తయారు చేయించి, ఆతర్వాత మేము, ఏదన్నా కారణం వల్ల రాలేకపోతే, ఆ పదార్థాలన్నింటినీ, ఈ కరువురోజుల్లో వృధా చేసుకోగలరా? ఆయన మమ్మల్ని ఒకరోజు, స్వయంగా వచ్చి, పిలిచి, వెంట తీసుకెళ్ళారు. మేము వెళ్లిన తర్వాత వంట చేయించడం అంత పెద్ద పనికాదే!

వారి మామగారిలాంటి ఉపాధ్యాయులూ ఆమెగారు తన మొదటి వ్యాసంలో పేర్కొన్న 'బ్రాహ్మణ ఉపాధ్యాయు'డి లాంటి వారూ, ఇరువురూ అరుదైన ఎక్సెప్షనల్ వ్యక్తులే. అందరూ ఈర్ష్యాపరులో,లేకపోతే అందరూ విశాలహృదయులో అయిఉండరు గదా! బ్రాహ్మణోపాధ్యాయులలో ఉన్న ఉత్తములను గురించి కూడా వ్రాయాలని ఉందిగానీ, అవసరానికి ఆదుకొనే మామగారు నాకెవరూ లేకపోవడంచేత, వ్రాయలేకపోతున్నాను.

రోడ్డు మీదున్న కంకర రాళ్లను తీసి పక్కకు పారేయమంటే, ఆ విషయం విమర్శపాలబడింది. కాకపోయినా, అడ్డదారులలో నడిచేవారికి అవి అడ్డంగానీ, సవ్యంగా బాట వెంట నడిచేవాళ్లని, పక్కకు పారేసిన కంకరరాళ్లు ఏం చేస్తాయి? కంకరరాళ్ళు, రోడ్డు కొత్తగా వేసేటప్పుడు

## వనితాలోకం

అవసరమౌతాయిగానీ, పూర్తి అయిన బాట మీది కంకరరాళ్లను ఏం చేయాలి?బాగున్న రోడ్డును, కంకరరాళ్లు పాతేయటానికిగాను త్రవ్వి, గోతులమయం చేయాలా, లేక తెలివిగా పక్కకు పారేయాలా?! విజ్ఞులైన పాఠకులు చెప్పాలి.

నాటువైద్యంకాదు, తన వ్యాసం 'శస్త్ర చికిత్స' అన్నారామె. ఆవిడ వెలిబుచ్చిన ఈభావం, నిజంగా, చాలా చక్కగా ఉన్నది. ఆమె భావప్రకటనా సామర్థ్యానికి, మనసుకు హత్తుకొనేలా విషయాల్ని చెప్పగల ఆమె నేర్పుకు, నా హృదయపూర్వకమైన అభినందనలు. కానీ, వ్యాసాలు వ్రాయడం వల్ల ఈ సమస్య అంతమవుతుందా, అనే నా అనుమానం.

ఏనాటి స్వయంకృతంవల్లనో, ఈనాడు ఇన్ని కష్టాలను భవిస్తున్న సత్యవతిగారు, మళ్లీ ఈజన్మలో కూడా, ఒకరికి అపకారం కలగాలని వాంఛిస్తూ (భగవంతునికి చెప్పి శిక్ష వేయిస్తానన్నారు.) మళ్లీ మళ్లీ భగవంతుడి శిక్షకు పాత్రురాలవడం, ఒక మానవిగా నేను భరించలేను. మానవులుగా, హృదయమున్న వ్యక్తులుగా 'సవర్ణు'లు, కలిగించిన సౌకర్యాలను, 'ప్రాయశ్చిత్త' ఫలితాలుగా చిత్రించారామె. నిండు హృదయంతో చేసిన మంచిని కూడా, మంచి అని గుర్తించలేని అల్పమనస్కులు, ఈర్ష్యాళువులు ఉన్నంతకాలం, హరిజనులకు, మోక్షమెప్పుడు? 'మానవులంతా ఒకటే' అని భావించి చేసిన మహనీయుల కృషిని, ప్రాయశ్చిత్త ఫలితంగా ఆమె భావించారంటే అంతకంటే ఆమె సంకుచిత దృష్టికీ, నిదర్శనమేం కావాలి?

'కడుపుమంటకాదు, బడబాగ్ని' అన్నారు. ఆవిడనుకొనే ఈ బడబాగ్ని, సాంఘిక అసమానతలు అనే పనికిరాని చెట్లనేకాక, మానవత్వం, సానుభూతి, కరుణ అనే మంచి గంధపు చెట్లను కూడా నిలువునా దహించి వేసి, అహంకారమనే బూడిదను మాత్రమే మిగులుస్తుందని, ఆవిడ లాంటి వారు గ్రహిస్తే, కనీసం అప్పటికైనా, కావలసిన మంచి, రావలసిన పరిణామాలు, తప్పకుండా వచ్చి తీరుతాయి.

సత్యవతిగారు, తమకు జరుగుతున్న అన్యాయాలను గురించి ఎలుగెత్తి వాపోతున్నారు. కానీ నేనొక విషయం నిర్భీతిగా చెప్పదలుచుకున్నాను:

ధనం, విద్య, మేధాసంపత్తి ఏ ఒక్కరి స్వంతమూకావు. అవి కష్టపడి సంపాదించే వారి స్వంతం. అవి ఉన్నప్పుడు 'అవర్ణు'లైనా, 'సవర్ణు'లైనా, సంఘంలో గొప్పగా చూడబడతారు. అవి లేనప్పుడు, హరిజనులైనా బాధ పడాల్సిందే, బ్రాహ్మణులైనా యాయవారం చేసుకొని బ్రతకాల్సిందే. ఇది తరతరాలుగా చరిత్ర రుజువు పరుస్తున్న సత్యం! 'మాకు డబ్బు, చదువు, ఏవీ ఉండవు, మమ్మల్ని మీ అందరితో సమానంగా చూడండి' అనే హరిజనుల మాటలను, ఈ పై చెప్పిన గుణాలన్నీ ఉన్న హరిజనులే దరిచేరనివ్వరు. ఈ లేములు, ఒక బ్రాహ్మణుడికున్నా, అతను మిగతా బ్రాహ్మణుల నుంచి, వెలిగానే ఉంచబడతాడు.

నిశిత విమర్శ చేసే సామర్థ్యం కొరవడి, కడుపుమంటతో, వ్యక్తి దూషణలతో, కాలకూట విషం లాంటి అహంకారం వెలిబుస్తూ వ్రాసే వ్యాసాలు వెలువడ్డంతకాలం, ఒక్క కుల సమస్యేకాదు, ప్రపంచంలోని ఏ సమస్యకూ పరిష్కారం ఉండదని ఘంటాపదంగా చెబుతున్నారు. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొని ప్రయోజనం లేదని సత్యవతిగారి లాంటివారు ముందే గ్రహిస్తే, ఎంతో మేలు.

నా ఈ విమర్శ మీద సత్యవతిగారు, తమ విజ్ఞానమంతా ఉపయోగించి, కరకు మాటలతో, దూషణలతో, మళ్లీ ప్రతివిమర్శ చేయవచ్చు. నిర్మాణాత్మకమైన వ్యాసాలు వ్రాయడం కష్టంగానీ, బరితెగించి బజారు పడ్డట్లుగా ఎవరు వ్రాయలేరు?! అసలు విషయం అడుగున పడిపోయి వ్యక్తుల కోపతాపాలు ప్రధానమైనప్పుడు, నేనింక ఏం చెప్పబోయినా, చెవిటి వానిముందు, శంఖూదినట్లే అవుతుంది. అందుకే, సత్యవతిగారు మళ్లీ విమర్శించినా, నేనుమటుకు ఆ పనికి పూనుకోను. కనీసం నా ఈ చివరి ప్రయత్నమైనా, అంధుల కళ్లకు నిజాన్ని చూపించగలిగితే, నా ప్రయత్నానికి సంపూర్ణ విజయం లభించినట్లు, నా వ్యాసానికి సార్థక్యం కలిగినట్లు భావిస్తాను.

వ్యాసాన్ని ముగించబోయే ముందు సత్యవతిగారికొక మనవి. ''సోదరీ, సత్యవతీ, మీ కష్టాలు సూటిగా నా గుండెకు తాకాయి. కానీ సమస్యలు ఈవిధంగా పరిష్కారమవుతాయా? వ్యక్తి దూషణ చేయదలుచు

కుంటే, పత్రికాధిపతుల నడిగి, నా చిరునామా తీసుకొని, నాకే ఉత్తరం వ్రాయొచ్చు గదా! పిన్నా, పెద్దా, చదివే పత్రికలోని విలువైన పేజీలను వృధా చెయ్యాలా?''

చివరగా ఆ సర్వరక్షకుడి కొక ప్రార్థన. "భగవాన్! నీ సృష్టిలో అంతా సమానులే. అసలే వేరు చేయబడ్డ వారిలో, అహంకారాన్ని నాటి, వారిని ఇంకా ఎందుకు దూరం చేస్తావ్? ఈ అహంకార తిమిరాన్ని తొలగించి, వారి బాధల నంతంచేసి, ఏక కులం ఏర్పడేలా సహాయపడమని నా ప్రార్థన!!'' ●

[ఇంతటితో ఈ వస్తువుమీద ఉత్తర ప్రత్యుత్తరాల ప్రచురణ నిలిపివేస్తున్నాము. సం॥]

జ రి గి న క థ

సత్యమూర్తి, ప్రశాంతం చిన్ననాటి స్నేహితులు. చాలాకాలానికి అనుకోకుండా కలిశారు. సత్యమూర్తి చెల్లెలు కళ్యాణి ఎక్కడికో వెళ్ళిపోయింది. అతను తల్లిని తీసుకుని రామవరానికి మకాం మార్చి, ప్రకాశం షుగర్ ఫ్యాక్టరీలో అక్కౌంటెంటుగా చేరాడు. ఆ చుట్టుప్రక్కల ప్రకాశానికి ఎక్కువ పరపతి వున్నట్లు గ్రహించాడు. మూర్తప్పుడు పంచాయితీ ప్రెసిడెంటయేందుకు ప్రకాశం సహాయం చేస్తున్నాడు. కాలేజీ వక్తృత్వపుపోటీల్లో మొదటి బహుమతినందుకున్న భానుమతి, ఉమ చక్కని స్నేహితురాళ్ళయారు. భారతి చదువు బాబాయి ఔదార్యంతో సాగుతోంది. తన భర్త తను ఎలా వేర్పడ్డారో భారతికి చెప్పింది ఉమ.

7

"హలో! ఉమాదేవీ, నాన్నగారున్నారా?" అని అడిగింది ఒకయువతి. ఆమెకు సుమారు నలభై ఏళ్ళుంటాయి, లావుగా, ఎర్రగా పొడుగ్గా వుంది. నీలం రంగు పట్టు చీర కట్టుకుంది. నఖశిఖ పర్యంతం అదేరంగు మేకప్‌లో వుంది. కళ్ళ జోడు పెట్టుకుంది. చేతిలో ఒక 'బాగ్' కూడా వుంది. ఆమెతో మరొక స్త్రీ కూడా వచ్చింది. వయస్సుదే గాని, మనిషి సల్లగా సన్నగా వుంది, తెల్ల చీర కట్టుకుంది, మేకప్ అంతా తెలుపులో వుంది. ఉమ వారిని చూసి, నమస్కరించి, "రండి. నాన్నగారింకా కాలేజీ నుంచి రాలేదు. వచ్చే వేళయింది, కూర్చోండి." అంది.

"మాకింకా చాలా పనుంది. మళ్ళీవస్తాం. మా క్లబ్బు యొక్క వార్షికోత్సవం జరుపుతున్నాం. ఆ మీటింగులో మాట్లాడమని శేఖరరుగారిని 'రిక్వెస్టు' చేద్దామని వచ్చాం" అంది, ఆమె పేరు శోభాదేవి.

"ఓ! అలాగా లేడీస్ క్లబ్బు, యూనివర్సిటీ వచ్చేసిందన్న మాట." అంది ఉమ. భానుమతి వారిద్దరినీ పరీక్షగా చూడసాగింది.

"అబ్బే! మాది లేడీస్ క్లబ్బు కాదు. వేరే 'వుమెన్స్ సోషల్ సర్వీసు క్లబ్బు' అని. ప్రారంభించాం. అప్పుడే ఏడాది కావస్తోంది. 'బిజినెస్‌మెన్' చాలా మందీ, కొంత మంది ఆఫీసర్లూ మాకు గట్టి 'సపోర్టు' ఇస్తున్నారు. లేడీస్ క్లబ్బు నిర్వహణ మాకు నచ్చక, వేరే ఈ క్లబ్బు స్థాపించాము. ఈమె, మనోరమాదేవి అని, మా వైస్ ప్రెసిడెంటు. మా మెంబరుషిప్పు ఇప్పుడు ఇరవైదాకా వుంది. ఒకసారి రా! మహారాణిలా వుంది. కాలేజి గర్ల్సు కూడా వస్తున్నారు" అంది శోభాదేవి.

"అలాగే వస్తాను" అంది ఉమ, అదే




సమయంలో రమా, పద్మినీ, కూడా ప్రవేశించారు. వారు, భానుమతి, ఉమలను పలకరిస్తూంటే, "మేం వచ్చి వెళ్ళామని నాన్నగారితో చెప్పు. మళ్ళీ వస్తాం" అని శోభాదేవి ఆమెతో వచ్చిన యువతి ఉమ వద్ద సెలవు తీసుకుని వెళ్ళి పోయారు. రమా, పద్మినీ, ఒకర్ని చూసి ఒకరు నవ్వుకుంటూంటే భానుమతి, "ఎందుకర్రా నవ్వుతున్నారు?" అని అడిగింది.

రమ, "ఆఁ ఆమెగారి మాటలకే నవ్వు వస్తుందిలే." అంది.

పద్మిని, "నేవా 'స్టాండర్డు' కారుని చూసే పోల్చేశాను, శోభాదేవి వచ్చి వుంటుందని. ఆవిడ మాటలు మాకు గుమ్మంలోంచే వినిపించాయి. నేనెలాగో నవ్వాపుకున్నాను, రమ ఆపుకోలేక పోయింది." అంది.

"ఆమె మాటల్లో విశేష మేమిటర్రా?" అని అడిగింది భానుమతి, అమాయకంగా నలుగురూ కూర్చున్నాక.

"అసలు ఆమె గురించి నీకేమైనా తెలుసా?" అని అడిగింది రమ. ఆమె వయస్సు ఇరవై వుంటుంది. చామనఛాయగా, సన్నగా, చలాకీగా వుంటుంది. పద్మిని ఎర్రగా కొంచెం బొద్దుగా వుంటుంది, ఆమెకు ఇరవై దాటింది. వీరిద్దరికీ భానుమతి అంటే ప్రాణం.

"అప్పుడప్పుడు లేడీస్ క్లబ్బుకు వెళ్ళినప్పుడు కన్పించేది. ఈ మధ్య వెళ్ళడం లేదు. అందరితో సోషల్‌గా వుంటుంది. అంతకన్నా ఆమె గురించి నాకేమీ తెలియదు." అంది ఉమ. భానుమతి తనకు అసలే తెలియదంది. పద్మిని, రమను చెప్పమంది.

"ఆమె వేరే ఒక చిన్న క్లబ్బు పెట్టడం, దానికి 'బిజినెస్' మెన్ సపోర్టు చెయ్యడం, వెనక, చాలాగాథ వుంది. అసలీవిడ, వెనక రోజుల్లో ఘరనా తిరుగుబోతు. అంటే, టిప్‌టాప్‌గా డ్రెస్సయి, రైళ్ళలో ఫస్టు క్లాసులో ఒంటరిగా ప్రయాణం చేస్తూండేది. టిక్కెట్టు కలెక్టర్లంతా ఆమె చేతిలో

వుండేవారు. ఎవడైనా బాగా డబ్బున్నవాడు తటస్థపడితే వాడితో కొంత కాలం వ్యవహారం నడిపేది. అంటే అది పరిచయ స్థలం అన్నమాట. ఆ వ్యాపారం లాభకరం గానే వుండేదట" ముగ్గురూ నవ్వారు. కాని భానుమతి ఆశ్చర్యంతో చూసింది.

"ఊఁ, చెప్పు." అన్నారు ఉమా పద్మినీ.

"ఆమె కప్పుడు ముప్ఫై ఏళ్ళు. ఆ రోజుల్లోనే ఒక మెడికల్ కంపెనీ సేల్సుమాన్‌తో పరిచయమైందిట. ఆయన పేరు శ్రీరామ్. ఆయనకు అప్పటికి దగ్గర దగ్గర ఏభై ఏళ్ళుంటాయి. ఒక భార్యా, నలుగురు బిడ్డలూ వున్నారు. అయినా ఈవిడ అందాన్ని చూసి మోహించి ఈవిడను వివాహం చేసుకున్నాడు. ఆయనకు నెలకు వెయ్యికిపైగా వస్తుంది. కారుంది ఆమాత్రం చాల్లే అనుకుని ఆమె, విశాఖపట్నంలో కాపరం పెట్టి, తన 'ఫైలు'ని అభివృద్ధి చేసుకోవటం మొదలెట్టింది. భర్తకు ఈమె ఎలా తిరిగినా అభ్యంతరం లేదో, ఏమో? తెలియదు కాని, పూర్లో వున్న ధనవంతులంతా ఆమెకు పరిచయస్థులే. తరుచుగా ఆమె యింట్లో పార్టీలు జరుగుతుంటాయి, ఇతరుల ఖర్చుమీద. దానికి కారణం, ఆమె భర్తకు, బ్రాందీ వగైరా పదార్థాలు తయారుచేసే కంపెనీకి ఏజన్సీ వుందిట."

"ఛీ! వాళ్ళ ఊసెత్తకు." అంది భానుమతి, అసహ్యించుకుంటూ. రమా, పద్మినీ చిరునవ్వులు నవ్వారు.

"చెప్పనీ, విషయమేమిటో తెలుసుకోవాలి." అంది ఉమ.

"ఇదంతా నిజం అంటావా?" అంది భానుమతి కోపంగా.

"బలే దానివిలే. లోకంలో ఏం జరుగుతున్నాయో నీకేం తెలుసు, కణ్వాశ్రమంలో శకుంతలలా పెరుగుతున్నావ్. మా అన్నయ్య చెప్పే మాటలు వింటే మనకు చాలా కనువిప్పవుతుంది." అంది రమ.

"అసలీవిడ గురించి అందరికీ తెలియడం మంచిది. ఎందుకంటే, కాస్త అందంగా కనిపించే యువతుల్ని మచ్చిక చేసుకుంటుంది. వాళ్ళని అన్నిరకాలా చెడగొడుతుంది." అంది పద్మిని.

"మరి ఇటువంటి వ్యక్తి పర్యలను ఆమోదిస్తూ పెద్దలంతా ఎందుకూరు

న్నారూ?" అంది – భానుమతి [illegible]

"పిల్ల చేసే పనుల్లో చాలా వాళ్ళకీ వుంది సుమీ. అసలు పెట్టుబడి పెద్దవాళ్ళదీ. తక్కిన నాటకం అంతా పిల్లది."

"నాకు తెలియదు సుమా, ఆవిడలాటి దని." అంది ఉమ.

"మీ అన్నయ్య కథలు రాస్తాడుకదా, ఇలాటి వాళ్ల గురించి రాయకూడదూ." అంది భానుమతి, రమని.

"రాసినంత మాత్రాన వాళ్లకేమీ నష్టం లేదంటాడు. పైగా వాళ్లు కూడా చదివి, భేష్ బాగుంది. సమాజాన్నంతా కడిగెయ్యండి, మీ రాతలతో, అని మెచ్చుకుంటారట, అవి తమని గురించి కానట్టు. అంత మాత్రాన జరిగేదేమీ లేదనే ధైర్యంతోనూ." అంది రమ.

"అయితే ఆ రెండవ ఆమె ఎలాటిది?" అని అడిగింది ఉమ.

"ఆవిడొక పెద్ద ఆఫీసరు గారి భార్య. ఆయన వలన పనులు సులభంగా కావాలంటే ఆవిడని ముందర కలుసుకుని చెల్లించవలసిన ముడుపు కాస్తా చెల్లించుకుంటే, పనులు సులభంగా అవుతాయట." అంది పద్మిని.

"నీకెలా తెలుసు?" అని అడిగింది ఉమ.

"మా మామయ్య ఒక ఫ్యాక్టరీ కట్టించాడు. దానికి కావలసిన లైసెన్సులు ఏవో ఆయన చేతిలో వున్నాయట. ఎన్నిసార్లు ఆయన ఆఫీసు చుట్టూ తిరిగినా పని జరగలేదట. అసలాయన ఆఫీసుకి రావడమే అరుదట. చివరికి ప్రాణం విసిగి, అసలు కీలక మేమిటో చెప్పమని ఒక ప్యూన్‌ని అడిగాడట. "మీకింకా తెలియదా సార్!" అని ఆశ్చర్య పోతూ వాడు, అమ్మగారిని కలుసుకోమన్నాడుట. అప్పుడు అమ్మగారిని దర్శించి, విషయం చెప్పుకుంటే, 'నాకో టేప్ రికార్డరు మీద మోజుగా వుందంది. అలాగే ఇచ్చుకుంటానని, వెంటనే కలకత్తా వెళ్లి, ఒకటి కొనుక్కొచ్చుకుని ఆవిడకి సమర్పించు కున్నాడట. వెంటనే కావలసిన పనులన్నీ జరిగి పోయాయి."

అందరూ నవ్వారు. "ఇలాటి వాళ్లు నిర్వహించే సంస్థ లెలావుంటాయో ఇంక వూహించక్కర లేదు." అంది భానుమతి.

"ఆమాట కొస్తే ఏది ఈ రోజుల్లో కట్టుదిట్టంగా వుంది? అన్నిట్లోనూ రాజకీయాల్లో [illegible] ప్రవేశించాయిది. మన పెద్దవాళ్లు అంటే పెద్దవాళ్ళని మనం [illegible] కాని [illegible] కాగి తాను ముందు కెళ్ళవు. రైళ్లల్లో—టిక్కెట్ల పర్మిట్లు గాని, గూడ్సుల్లో పెట్టవలసిన సరుకులుగాని లంచం లేందే కదలవు. ఇక పెళ్లిళ్ల విషయంలో, కట్నం పేరుతో



లంచాలు గుంజుతున్నారు కదా!" అంది రమ.

"అన్నట్లు మన స్నేహితురాలు రాజ్యలక్ష్మి పెళ్లి ఆగిపోయింది, తెలుసా?" అంది పద్మిని. అందరూ "ఆ!" అన్నారు.

"అవును. ముందర కట్నం లేకుండా చేసుకుంటానన్న మహానుభావుడు, ఆయన తల్లిగారు ఎక్కడి నుంచో వచ్చి బోధించే సరికి, రాత్రికి రాత్రి రంగు మారుతుంది. కట్నం కావాలంటే పరువు దక్కదని, అసలు పెళ్లే వద్దన్నారుట. పోనీ అతనే రాజ్యలక్ష్మి అందంగా వుంటుంది. వాళ్లిష్టమంటే చాలు, పెళ్లి చేసుకుంటానన్నాడు. ఇప్పుడిలా మారాడు. రాజ్యలక్ష్మి తల్లిదండ్రులు కట్నం ఇవ్వలేని వాళ్లు అని అందరికీ తెలుసు. ఆమె పెళ్లి పెద్ద సమస్య అయింది."

రాజ్యలక్ష్మి అవస్థకు అందరూ విచారించారు. భానుమతి, "అటువంటి పరి

# సుప్రభాతం

స్థితులలో పెళ్ళిగురించి తొందరపడడం కన్నా చదువుకుని ఉద్యోగం చేస్తూ, స్వతంత్రంగా బ్రతకడం మంచిది. తల్లిదండ్రులు కూడా అందుకు దోహదమివ్వాలి'' అంది.

''నిజమే కాని, పెళ్ళి చెయ్యక పోతే నలుగురిలోనూ తలవంపులని తల్లిదండ్రుల బాధ'' అంది ఉమ.

''మీ కొక విషాద వార్త తెలియ జేస్తున్నాను. శశిరేఖ అనే అమ్మాయిని మీరెరుగుదురా?'' అని అడిగింది రమ.

''పాటలు బాగా పాడ్తుంది కదూ?'' అంది భానుమతి.

''అవును. మా వీధిలోనే వుంటున్నారు వాళ్ళు. మనిషి ఎర్రగా బాగానే వుంటుంది. పద్దెనిమిదేళ్ళుంటాయి. స్కూలు ఫైనలు పాసయింది. 'నృత్యనికేతన్'లో బాక్ గ్రౌండు మ్యూజిక్ ఆర్టిస్టుగా పనిచేస్తోంది. అందులోనే ఓ ముస్లిమ్ యువకుడితో పరిచయం ఏర్పడిం దంటారు. నిజమెవరికీ తెలియదు. మొన్న మధ్యాహ్నం వాళ్ళ నాన్న గారు గట్టిగా కేకలేశారు. దాంతో ఆ అమ్మాయికి రోషం వచ్చి, వాళ్ళ పెరట్లోని నూతిలోకి దూకి ఆత్మహత్య చేసుకుంది.''

''అరెరె!'' అన్నారంతా.

''తరువాత, వాళ్ళ దుఃఖం ఇంతా, అంతా కాదు. నిన్న పొద్దున్న ఏడు గంటలకి నా ఫ్రెండు, పద్మ వివాహానికి వెళ్ళాను. ఆ వివాహం జరుగు తున్నంతసేపూ, నా మనస్సులో శశిరేఖే మెదిలింది. పద్మ, వాళ్ళ నాన్నగారు అయిదువేలు కట్నం ఇచ్చి, నెలకు అయిదువందలు తెస్తున్న ఒక అనాకారి—మగ మొద్దునుతీసుకొచ్చికట్టారు. డబ్బు లేని వాళ్ళపిల్ల కాబట్టి శశిరేఖకు ఆ యోగం లేకపోయింది. ఇటు సరిగ్గా ఈ పెళ్ళి జరుగుతున్న సమయంలోనే అటు ఆ శవానికి అంత్యక్రియలు జరుగు తున్నాయి. అదృష్ట మనేది ఎలావుంటుందో, నవిపించింది.''

''అసలా అమ్మాయి 'నృత్యనికేతన్'లో పాడుతున్నందుకు ఏదో ఇచ్చే వారనుకుంటాను.'' అంది పద్మిని.

''అవును. ఉదయకుమార్ పాపం ఆమెనెంతో గౌరవంగా చూశేవారు. వాళ్ళ కుటుంబానికి చాలా సాయం చేశాడు.''

''ఉదయకుమార్ అంటే డాన్సరు కదూ?'' అని అడిగింది భానుమతి.

''అవును. నృత్యనికేతన్ సంస్థ స్థాపించింది అతనే. చాలా మంచి పేరు సంపాదించాడు. ఒక స్కూలు కూడా నిర్వహిస్తున్నాడు.''

''ఆ మధ్య అతనిని ఏవో పనులు చేస్తున్నాడని నిందించారు, వాళ్ళు. కాని, మా నాన్నగారు అతను చాలా మంచి వాడని అన్నారు'' అంది ఉమ.

''అతను మంచి వాడే. కాని అందరూ అనడం ఏమిటంటే ఈ 'నృత్యనికేతన్' పేర వచ్చిన డబ్బంతా అతనే కాజేస్తున్నాడని, పైగా అందులో డాన్సు నేర్చుకుంటున్న పిల్లలందర్నీ ప్రోగ్రామ్సుతో వేసి, వాళ్ళకేమీ ఇవ్వకుండా తనే మిగుల్చుకుంటున్నాడనీ, కాని అతను ఎంత కష్టపడి ఆ డాన్సు స్కూలు నభివృద్ధిలోకి తెస్తున్నాడో ఎవరికీ అక్కర లేదు.''

''అక్కర లేకపోవడం ఏమిటి, అనవిలా చేస్తున్నాడనే వాళ్ళ బాధ! అలా చేసి పేరు ప్రతిష్ఠలు గడించేస్తున్నాడే అని దిగులు! మన కళ్ళముందరే గొప్పవాడై పోతున్నాడే అని ఏడుపు!'' అంది పద్మిని.

''అది మన ఆంధ్రులలో వున్న సహజప్రకృతే కదా. మనలో ఎవరైనా అభివృద్ధిలోకి వస్తున్నారంటే గర్వించి, ప్రోత్సహించే బదులు వాళ్ళ నెలాగైనా పడగొట్టాలని చూడడం మన కలవాటు కదా. అందుకే మనలో ఎంత ప్రజ్ఞా, ప్రతిభా వున్నా పైకి రాక, అణగిపోవడం జరుగుతూంది కదా. మనలో వున్న గొప్పతనాన్ని కూడా మన అసూయకు బలి చేసుకుంటున్నాము.'' అంది భానుమతి.

''అంతే నంటావా? అయితే మనలో కూడా గొప్ప వుందంటావా?'' అంది రమ, కాస్త సందేహాన్ని వెలిబుచ్చు తున్నట్లుగా మొహం పెట్టి.

''ఓ! నిస్సందేహంగా. మనకు తమిళులలా కార్య దీక్షా, పట్టుదలా గాని మళయాళీలలా చురుకు తనం గాని లేదు సరికదా, మనలోని లోపాన్ని చాటుకోవడం బాగా చాతవును. ఇతరుల ననుకరించడంలో మనం సిద్ధ హస్తులం. త్యాగరాజు మన వాడని చెప్పుకోవడమే గాని, మనం కర్ణాటక సంగీతాని కేం ప్రోత్సాహం ఇస్తున్నాం? కూచిపూడి నృత్యం ఎంత గొప్పది! అమెరికా వచ్చి, నాగార్జున కొండ, రామప్ప మొదలైన

చోట్ల అద్భుత శిల్పాలను సృష్టించిన ఆంధ్రుల సంతతి వారమే కదా, మనం. ఇప్పుడు మాత్రం మనలో ప్రసిద్ధ కళా కారులూ, విద్యావంతులూ, డాక్టర్లూ, ఇంజనీర్లూ ఎంత మంది వున్నారు. కాని మనలోని వోర్వలేనితనం వాళ్లని పైకి రానీయకుండా చేస్తోంది."

అప్పుడే బైట కారుదిగి మరి యిద్దరు స్టూడెంట్సుతో కలసి అనంతరావుగారు లోపలికి ప్రవేశిస్తూ భానుమతి అంటున్న ఆఖరి మాటలు విన్నారు. "నిజం! ఉన్న మాట చెప్పావమ్మా." అన్నారు. ఆడపిల్ల లందరూ ఆయనను చూసి, నిలబడి నమస్క రించారు. ఆయన పంచే లాల్చీ వేసుకున్నారు. చేతిలో పుస్తకం వుంది. కళ్లకు జోడుంది.

"మీటింగు ఏదైనా జరిగిందా మాస్టారూ?" అని అడిగింది ఉమ. భానుమతీ, రమా, పద్మినీలు జవాబుకోసం ఆయన వైపు చూశారు. మగ విద్యార్థులను కూచో మని చెప్పి ఆయన, "అవునమ్మా." అంటూ తన గదిలోకి వెళ్లిపోయారు. ఆయనతో వచ్చిన శ్యాంసుందర్, రమణమూర్తి అనే విద్యార్థులు, "స్వామీ అమృతానందా లెక్చర్లు జరుగుతున్నాయి, మీకు ఆసక్తి లేదా?" అని భానుమతినీ వాళ్లనీ ఉద్దే శించి అన్నారు. అది వినగానే వాళ్ల మొహా లలో ఉత్సాహం కన్పించింది.

"ఎందుకు లేదూ. అసలు వాటిసంగతే మాకు తెలియలేదు. లేకపోతే తప్పక వెళ్లి వుండేవాళ్లం. ఇంకా వుంటాయా?" అని భానుమతి అడిగింది.

"ఇంకో పది రోజులు జరుగుతాయి." అన్నాడు రమణమూర్తి. ఇంతలో అనంత రావుగారు తిరిగి వచ్చి ఒక పుస్తకం శ్యాం సుందర్ చేతిలో పెడుతూ, "ఇది తప్పకుండా ప్రతి విద్యార్థీ చదువ వలసిన పుస్తకం. అన్నారు. ఆ పుస్తకం ఇటూ అటూ తిప్పి చూస్తున్న శ్యాంసుందర్‌తో, "ఇక వెళ దామా" అన్నాడు రమణమూర్తి.

"మీరు కూడా వెళ్లారా మాస్టారూ?" అని అడిగింది భానుమతి. ఆయన సోఫాలో కూర్చుంటూ, "అవునమ్మా." అన్నాడు.

"మీరు సైన్సు గురించీ, పాశ్చాత్యుల గురించి అంత గొప్పగా చెప్తారు కదా [illegible] ఈ ఋషులూ, వేదాంతం మొదలైన [illegible] కూడా [illegible] [illegible],

మాస్టారూ?'' అని అడిగాడు శ్యాం సుందర్.

''అవునోయ్, అందులో అసహజ మేమి ఉంది? ఇప్పుడు పాశ్చాత్యులలో వ్యాపించిన వైజ్ఞానిక పరిశోధనాసక్తి మనదేశంలో ఏనాడో వుంది. మన ఋషులు కూడా అనేక విషయాలు కని పెట్టారు. కాని వాళ్ళ దృక్పథమే వేరు. వారిది ఆధ్యాత్మిక శక్తి కోసం పరిశోధన, పాశ్చాత్యుల దంతా భౌతిక ప్రకృతి పరిశోధన. ఈ రెంటినీ సమన్వయించందే మానవ జాతికి నిజమైన శాంతి లభించదు.''

''మరి మన ఆధ్యాత్మిక దృక్పథమే కదా మనల్ని స్థితికి తీసుకు వచ్చింది?'' అన్నాడు శ్యాంసుందర్.

''అది మన తప్పుగాని, మనసంస్కృతి తప్పు కాదు. మనం అనవసర ఛాందసాలలో పడి, పరస్పర ఈర్ష్యాళువులమై, విదేశీయులు మన దేశంలో సామ్రాజ్యం స్థాపించుకోవ డాని కవకాశం ఇచ్చి, వారి పరిపాలనలో మన ఆత్మ గౌరవాన్ని కోలుపోయి, వట్టి సోమరిపోతులమై, దరిద్రులమై, మన మెవరమో మనకు తెలియనంతగా పత నమై, మనం పైకొచ్చే అవకాశాలను పోగొట్టు కున్నామంటే, అది మన అజ్ఞా నానికీ, సంకుచిత స్వభావానికీ నిదర్శనం. కాని మన సంస్కృతి గొప్పదనీ, ఆధ్యాత్మి కంగా మనదేశం ఇతర దేశాలకు గత కాలంలో మార్గదర్శక మైందనీ, మనం ప్రయత్నించి కృషి చేస్తే, పైకి రాగల శక్తి కలవారమని ఋజువు చేసేందుకే మనలో అనేక మంది మహానుభావులు ఉదయించారు. స్వామీ వివేకానంద తన ఉప న్యాసంతో అన్ని దేశాల వారినీ ఘుగ్ధుల్ని చేశాడంటే, ఆయనలోని శక్తికి మూలం ఏది? మహాత్మాజీ, నెహ్రూ, రమణమహర్షి, మొదలైన గొప్ప వ్యక్తులు ఉద్భవించిన దేశం సామాన్య మైంది కాదు కదా! ఇంతే కాక, హిమాలయాలలోనూ, అక్కడక్కడ ఆశ్రమాలలోనూ, అనేక మంది మహర్షులు యోగీశ్వరులూ వున్నారు. వారు తల్చు కుంటే అద్భుతశక్తుల్ని ప్రదర్శించ గలరు. వాటికి, సైంటిఫిక్‌గా తగిన సమాధానం కూడా ఇవ్వగలరు.''

''అసలా శక్తులన్నీ వుండటం నిజమేనా? వాటికి వాళ్ళు ఏవిధంగా 'సైంటిఫిక్' వివరణ ఇవ్వగలరు?'' అని అడిగాడు

# సుప్రభాతం

శ్యాంసుందర్. అందరూ అనంతరావుగారి వైపు చూశారు.

''ఈ మధ్యనే ఒక పాశ్చాత్యుడు, ఒక యోగిని కలుసుకొని ఈ అద్భుత శక్తు గురించి ప్రస్తావిస్తూ, 'దశాబ్దాలుగా కొందరు యోగులు ఆహారం తీసుకోకుండా వుంటారుట, నిజమేనా?' అని అడిగాడట దానికా యోగి, 'ఇందులో విశేషమేముంది? మనం తీసుకునే ఆహారమంతా చివరకు శక్తిగా మారవలసిందే కదా. మనం మాంసం తింటూన్నామంటే, ఆ జంతువు, వృక్షా న్నుండి ఆహారం సంపాదిస్తుంది, ఆ వృక్షం దాని ఆహారాన్ని సూర్యరశ్మి సహాయంతో తయారు చేసుకుంటోంది. చివరికి జీవ జాలమంతా తమ ఆహారాన్ని సూర్యరశ్మి నుండి, 'క్లోరోఫిల్' ద్వారా, పొందగలుగు తున్నట్లే కదా. మహాయోగి ఈ ఆహార పద్ధతిని విసర్జించి తిన్నగా సూర్యరశ్మినే గ్రహిస్తాడు, ఆశక్తి వుంది కాబట్టి. అతని జీర్ణావయువములు పని చెయ్యడం మానే స్తాయి. విసర్జనావయువములకు కూడా పని వుండదు. చెమట పట్టడం తప్ప. అత నికి కావలిసిందల్లా రోజూ కొద్ది సేపు ఏకాగ్రతతో సూర్యరశ్మి కెదురుగా నిల్చి దానిని గ్రహించడమేనూ. వృక్ష జాలం సూర్యరశ్మితో జీవిస్తోంది కదా, అందులో పెద్ద అద్భుత మేముంది?' అన్నాడు. అలాగే భవిష్యత్తును తెలుసుకోవడం, భూమికి పైగా లేవగలగడం, దూరశ్రవణం మొదలైన వాటన్నిటికీ కూడా, యోగి తనను తాను తెలుసుకున్న వాడై, ఈ భౌతిక దేహా న్నుండి విడివడగల శక్తి కలవాడైనప్పుడు, ప్రకృతిలోని మూల శక్తులతో తిన్నని సంబంధం కలిగి యుంటాడు, అప్పు డీ అద్భుతా లతనికి ఒక లెక్కకాదు, అని చెప్పాడు. అందువలన ఈ శక్తులువున్నాయి. కాని అవి యోగులకే గాని సామాన్యులకు సాధ్యం కాదు.'' అని ఆయన చెప్పేసరికి అందరి మనస్సులలోనూ ఒక విధమైన శ్రద్ధ ఏర్పడింది. కొద్ది నిముషాలు అందరూ మౌనంగా వూరుకున్నారు, ఆలోచనల్తో ముసురుకున్న మనసులతో. రమణమూర్తికీ, శ్యాంసుందర్‌కీ వెళ్ళాలని గుర్తుకొచ్చింది.

''వెళ్ళొస్తాం మాస్టారూ. చాలా ఆలస్య మైంది.'' అని ఆయన దగ్గర సెలవు తీసుకుని వాళ్ళిద్దరూ వెళ్ళి పోయారు.

భానుమతీ, రమా, పద్మినీలు కూడా వెళ్ళిపోతామని చెప్పి తమ ఇళ్ళకు బయ ల్దేరారు, అనంతరావుగారు తను కార్లో దిగబెడతానంటే. అక్కర్లేదని, వారి ముగ్గురి ఇళ్ళకూ అట్టే దూరం లేదు. రమా, పద్మినీలు లలితా నగరంలో వుంటున్నారు.

ముగ్గురూ నడిచి పోతూంటే, ''మనం అంతసేపు లోకాభిరామాయణం మాట్లా డామూ, మాస్టారు చెప్పిన కాసిని మాటల ముందరా అవి వట్టి గాలి కబుర్లలా, పనికిరాని మాటలుగా కన్పించాయి సుమా!' అంది, పద్మిని. తక్కిన వారిద్దరూ అవు నన్నారు.

''విజ్ఞానాత్మక సంభాషణకీ, బాతా ఖానికీ అదే తేడా''

''ఏమిటో గాని కొన్ని కొన్ని అలా మన సును పట్టేస్తాయి. అంతా సంగీతమే అయినా, త్యాగరాజ కృతులు ఎన్ని సార్లు విన్నా నిత్య నూతనంగా కన్పించి, సినిమా పాటలు రానురాను మోజును కోల్పోయి నట్లు, ఈ విషయాలలో ఏదో ప్రత్యేకత వుంది.'' అంది రమ.

''అవి సర్వకాలాలకూ సంబంధించిన వనుకుంటాను. తాత్కాలిక మైన వాటికీ నిత్యమైన వాటికీ అదే తేడా.'' అంది భానుమతి.

వారు ముగ్గురూ ఇళ్ళకు చేరుకున్న చాలా సేపటి వరకూ ఇవే ఆలోచింపసాగారు. కాని ఆ ఆలోచనలు అట్టేసేపు నిలవ కుండా రమా, పద్మినులను, వాళ్ళ ఇంటి వాతావరణం మార్చేసింది. కాని భాను మతి, ఇంటికి వెళ్ళి భాగవతం పఠించడం, స్తోత్రాలు చదువుకోవడంతో అవి మరింతగా విజృంభించాయి. తల్లి తండ్రులతో ఈ విషయం చెప్తూ ఎంతో ప్రశాంతత ననుభ వించింది. అనంతరావుగారి విజ్ఞానానికి సంతోషం ప్రకటించింది. ఆయన వద్ద తెలుసుకోదగిన విషయాలెన్నో ఉన్నా యను కుంది. ఆయనను ఇంకా కొన్ని విషయాలు అడగాలను కుంది. అలా ఆలోచిస్తూ నిద్రపోయింది.

(సశేషం)




"సురేఖా, గేటువేసి మరీపో. ఆవులు లోపలికొచ్చి చెట్లు తినేస్తే, సాయంత్రం వచ్చి మామీద కారాలు మిరియాలు నూరక", తల్లి కంఠం ఖంగుమని మ్రోగుతున్నా వినిపించుకోకుండా పరుగెత్తింది సురేఖ కాలేజీకి. అబ్బ! తొమ్మిదిన్నరకల్లా కాలేజి గేటుదగ్గర ఉండాలి తను. అప్పుడే తొమ్మిది ఇరవై అయింది! గబగబాఅడ్డదారమ్మట నడుస్తోంది సురేఖ. దూరంగా తారురోడ్డు వచ్చటి పైర్ల మధ్యనుండి కనబడుతోంది. నల్లటి త్రాచుపాములా నీలాకాశంలో తెల్లటి మబ్బులు పరుగెడుతున్నాయి. "ఓనీల్ గగన్‌కే దీవానే, తూ ప్యార్ వ మేరా పహచానే........" పాడుకుంటూ నడుస్తోంది సురేఖ. మబ్బురంగు పట్టు పరికిణి యొక్క నల్లటి [illegible] లాగి గట్టెక్కింది సురేఖ. ఒక్క నిముషం అలాగే నిల్చుని తమ కాలేజీ సౌందర్యాన్ని తిలకించ సాగింది. ఢిల్లీలో అధునాతనమైన కాలనీల్లో కైలాశ్ కాలనీ ఒకటి. దాని ప్రక్కనే అధునాతనమైన కాలేజీల్లో 'లేడీ శ్రీరామ్ కాలేజ్ ఫర్ వుమెన్!', మధ్యన పచ్చటి పైరు! ఇలాంటి దృశ్యం ఢిల్లీలో కనబడడం అరుదే!

"హల్లో! అలా నిలబడ్డావేమిటి? పద" అంటూ ఉష వచ్చింది. "ఆ! పద" అని సురేఖ నడిచింది కాలేజీ ఆవరణలోకి. గేటు దగ్గర చుట్టూ చూసింది. మీనా ఇంకా రాలేదు. తెల్లగా సన్నంగా ఉంటుంది జపాన్ నుండి వచ్చిన మీన. ఆ హైహీల్డు బూట్లు టక టకలాడిస్తూ నడుస్తూ వుంటే, ఆ స్కర్టు వూగుతూంటే మీనాకే బాగుంటుంది. మీనా లేకపోతే ఒక్క క్షణంకూడా గడవదు రేఖకు.

"ఏలోకంలో వున్నావు?" ఉష కుదుపుతూ మాట్లాడేస్తోంది. ఇంకా కొంత మంది అమ్మాయిలు కనబడ్డంతో ఉష వెళ్ళిపోయింది. మేడమీద క్లాస్‌రూంలో బుక్స్‌పెట్టి, పర్సు, ప్రేయర్ బుక్కూ తీసుకుని కారిడర్ లోకి వచ్చిన సురేఖ గతుక్కుమంది! "అదోమీనా వస్తోంది. అబ్బ వచ్చేసింది!" గబగబా మెట్లు దిగుతూ జారిపోబోయింది సురేఖ. "హలో రేఖా! గుడ్‌మార్నింగ్." "హాయ్, గుడ్ మార్నింగ్" అంటూ మీనా చెయ్యిపట్టుకుంది. ఇద్దరూ కలిసి ఆడిటోరియమ్‌లోకి వెళ్ళారు. ప్రేయరు మొదలయింది. ఇద్దరూ ఒక ప్రక్కగా నిల్చున్నారు. సురేఖ మీనానే చూస్తోంది. అబ్బ! ఆచెక్స్‌వేసిన స్కర్టు ఎంత బాగుందో

ఆ సెరిలిన్‌బ్లవుజ చేతులు పైకి మడిచింది. అన్నయ్య షర్టు చేతులు అలాగే మడుస్తాడు. మెడలో సన్నటి బంగారం గొలుసు. లాకెట్‌లాగా వేళ్ళాడుతున్న స్క్వేర్ వాచి. ఓహ్! జపాన్‌లో ఎన్ని దొరుకుతాయో! చక్కగా బొమ్మలా ఉండొచ్చు. ఆలోచనల్లో ఎప్పుడు క్లాసుకి వచ్చిందో తెలియలేదు.

"యస్, సురేఖా. యూ డూ దిస్ సమ్ ఆన్ ది బోర్డ్" అని మేడమ్ పిలుస్తూంటే జంకుతూ వెళ్ళింది సురేఖ. చాక్‌పీసు తీసుకుని రాస్తోంది. "వై ఈక్వల్‌టూ త్రీ కాస్ ఎక్స్. డి వై బై డి ఎక్స్ ఈక్వల్‌టూ......"

"అబ్బ ఎంతచక్కంగా రాస్తోంది. నైలాన్ జార్జెట్ వోణీ తుఫాను గాలికి రెపరెప లాడు తోంది. రెండు జడలూ పైకి కట్టిన రెండు నీలం రిబ్బన్లూ దుబ్బుగా ఉన్న సురేఖ ఎంత బాగుందో" ఆలోచిస్తున్న మీనా ఉలిక్కిపడింది. అందరూ నవ్వుతున్నారు. మేడమ్ ఇంకో లెక్క మీనాని చెయ్యమంది. బోర్డు దగ్గరకు వెళ్తే చెయ్యడంరాలేదు. మేడమే చేసి చూపించింది.

మధ్యాహ్నం ఎక్కడ వెదికినా కనబడలేదు మీనా. చప్పున జ్ఞాపకం వచ్చింది. కాలేజీ వెనకాల ఆవరణలో కూర్చుంటారు ఇద్దరూ అప్పుడప్పుడూ. ఉష ఆశా పిలుస్తున్నా వినిపించుకోకుండా పరుగు తీసింది సురేఖ.

"ఓమీనా ! ఏమయింది?" దూరంగా కూర్చుని ఏదో ఆలోచిస్తున్న మీనా రేఖ పిలుపుతో త్రుళ్ళిపడి అటు చూసింది "మరి ఇవాళ ఈ మౌన వ్రతం ఎందుకు? వెధవది, ప్రొద్దుటి నుండి ఒక్కపీరియడూ ఖాళీలేదు. అందుకని నీతో మాట్లాడలేదు. 'లైబ్రరీలో వెతికి, ఇక్కడ ఉంటారేమో మహారాణి గారు అని వచ్చేను.'"

"కనిపించావుగా? మరి వెళ్ళిపోవచ్చు". "ఏం? ఏమిటి సంగతి. లెక్కలురాలేదనేనా ఈ కోపం ?"

"అవును ఈలెక్కల ఆనర్సు ఎందుకు తీసుకున్నానా అనుకొంటున్నాను".

"మారేం ఫరవాలేదు. రెండుసార్లు చేస్తే అవే వస్తాయి. మరి పద".

"నేనేం రాను. నువ్వెళ్ళు." "అయ్యో! ఇంచక్కటి అమ్మాయిని ఒంటరిగా వదిలి వెళ్ళిపోవడమే ?"

"మరేం. ఎత్తుకు పోవడానికి ఇదేం కోఎడ్యుకేషన్ కాలేజీకాదుగా. అంతగా కావలిస్తే నన్ను మోసుకెళ్ళే శక్తివున్న ఏ అమ్మాయో రావాలి.!"

"అలాగా! అయితే నేనేవచ్చాననుకో. సరే పద. కోకాకోలా తాగుదాం. దాహం వేస్తోంది."

"యస్, లెట్ అజ్ గో".

"సాయంత్రం యింటికి వెళ్తూంటే "ఏమిటి, అంత సీరియస్‌గా ఆలోచిస్తున్నావు?" అనడిగింది మీనా.

"ఏంలేదు. నిన్ను ఎప్పుడు మోసుకు పోదామా అనుకుంటున్నాను" అందిరేఖ చిలిపిగా. "అయితే రేపు ఫ్రెషర్స్ పార్టీకదా. సాయంత్రం వరకు ఫ్రీగా ఉంటాం. అప్పుడొస్తాను."

"వెరీ గుడ్. సయోనారా.....!"

"ఓకే. సయోనారా......"

* * *

"వదినా, వదినా......"

"అదో తుఫాన్ మెయిల్ వచ్చేసింది. అందరూ దార్లొంచి తప్పుకోండి" అంటూ ప్రత్యక్షమయింది సరళ కాఫీకప్పుతో. పుస్తకాలు టేబిలు మీదకు గిరవాటేసి "వదినా, ఇలా ఉంటే లాభంలేదు. ఇల్లంతా నీటుగా సర్దాలి. కారప్పూస, స్వీట్స్ మీకు వస్తే......అబ్బే మీరేం చెయ్యలేరు. అమ్మా ఓ అమ్మా......"

"ఏమిటే ఆగోల...? ఏరాజకుమారుడొస్తున్నాడు?" అంటూ ప్రసాద్ వచ్చేడు! "కాదు రాకుమార్తె —మా మీనావస్తోంది రేపు. వదినా మాఅన్నయ్య ఆంధ్రప్రదేశ్ అంతా గాలించి మీలాంటి అప్సరసని ఎంచుకున్నాడని మురిసి పోవద్దు. మీనాని చూస్తే మీరే కాదు అన్నయ్య కూడా మూర్ఛపోతాడు. జపాన్‌నుండి వచ్చిన అమ్మాయి ఎంత స్మార్ట్‌గా, డెలికేట్‌గా ఉంటుందో చూద్దురుగాని"

* * *

ఒకరోజు.

మేడమీద కారిడర్‌లో నిలబడి మీనా కోసం నిరీక్షిస్తోంది రేఖ. క్రిందని దూరంగా గేటు దగ్గర కార్లు వచ్చి పోతున్నాయి, స్టూడెంట్స్‌ని వదిలి పెట్టి. "అదో మీనా" అనుకుంది. కానీ ఆమె ఒక కారుని ఆనుకొని ఇంకెవరితోనో మాట్లాడుతోంది. నల్లటి పాంటు, తెల్లటి టెరిలిన్ షర్టు వేసుకున్న పొడుగ్గా ఉన్న వ్యక్తి ఎవరో తెలియలేదు. రెండునిమిషాలతోక మీనా స్కర్ట్ ఫ్లాప్పులాడుతూ గేటుదాటి లోపలికి వచ్చింది. తను కనబడకుండా తప్పుకుంది సురేఖ. "అబ్బ ఎవరో అది ? ఇంతచనువుగా ఉన్నా, మీనా నాకీ విషయం చెప్పలేదే?" అనుకుంది. క్లాసులో పుస్తకాలు పెడుతున్న మీనా చేతిలో ఒక నవల కనబడింది. దానిమీద "విజయ్.సి" అని రాసుంది.

"ఎవరిదిమీనా?" అనడిగింది రేఖ, "మాకజిన్ బ్రదర్‌ది" అని చెబుతున్న మీనా రేఖ కళ్ళల్లోని తీవ్రతను, చిలిపి తనాన్ని చూసి నివ్వెరపోయి "రేఖా" అంటూ నవ్వేసింది.

* * *

"రేఖా! ఒక లెటర్ నీకు" అంటూ ఒక నీలం కవర్ని అందించింది సరళ. చదువుదామని ఆత్రుతగా కవరు విప్పుతూ లాన్‌లోకి పోబోతున్న రేఖని "ఇక్కడే చదవకూడదూ ? అంత తొందరెందుకు ? శ్రీవారు రాసే ఉత్తరాలన్ని ఇలాగే ఎవరికీ కనబడకుండా చదువుకుందువు గానిలే" అని సరళ ఎగతాళి చేసింది. ఏమీ వినిపించుకోకుండా చదవ సాగింది రేఖ. అది రీటా వ్రాసింది. స్కూలు వదిలి ఏడాదయింది. ఒక్కసారైనా వ్రాయలేదు.

"మర్చిపోయావా?" అనడుగుతోంది పిచ్చి రీటా. స్కూల్లో ఎప్పుడూ కలిసితిరిగే వాళ్ళు. చటుక్కున మర్నాడు టెస్ట్ ఉందని గుర్తుకొచ్చి హడావుడిగా గదిలోకి వెళ్ళింది.

* * *

"హమ్మయ్య! అన్నీరైటే." అనుకుంటూ నిలబడ్డ రేఖని "ఎలా చేసేవు?" అనడుగుతూ వచ్చింది మీనా. "అబ్బే అంతబాగా చెయ్యలే"దంటూంటే చేతిలోని పుస్తకం తీసుకుంది మీనా ఆన్సర్లు చూడ్డానికని. పుస్తకం తిరగేస్తూంటే నీలంకవరు క్రింద పడింది. గబుక్కున తీసుకుంది సురేఖ. దాంతో మీనా రేఖ చెయ్యిపట్టుకుని లాన్‌లోకి తీసుకెళ్ళి సావకాశంగా కూర్చుని "ఇప్పుడు చెప్పు నీకజిన్ బ్రదర్ పేరు. ఎందుకంత ఆశ్చర్య పోతావు? పట్టుబడి పోయావనా? ఆవేళ నన్ను అప్పుడో....." అంటున్నమీనామాటలు అర్థం అవలేదు రేఖకి. "ఎవరబ్బా ? ఎప్పుడు వచ్చింది లెటర్? ఎక్కడమీటవుతారు?.." అనడుగుతున్న మీనా అసహ్యంగా కనబడింది రేఖకి. "నీమొహం".

"వాట్?" "నథింగ్" అని ఏదో అనో

[illegible]నతో పడింది రేఖ. "బతికేను. దీనికి తెలుగు రాదు." అనుకుంటూ. మీనా పంజాబీ అమ్మాయి. తను నిప్పులుకడిగే బ్రాహ్మణ వంశంలో పుట్టింది. తనకు ఇలాంటి ఆలోచనలు ఎప్పుడూ రావే. మరి మీనా ఇలా అంటున్న దేమిటి? ఛ. మీనా ఎప్పుడూ ఇంతే. తను టోక్యోలో ఉన్నప్పుడు ఎందరో అబ్బాయిలతో స్నేహంట. అలాగే ఇక్కడ కూడా ఉన్నారు కాబోలు . భయమేసిందిరేఖకి.

సాయంత్రం యింటికి వచ్చేసరికి, "సరళా! ఇంకా తయారవలేదూ?" అంటున్న ప్రసాద్ కంఠం వినిపించింది. "వదినా ఏంచీర కట్టుకున్నావ' నంటూ రేఖ తన పీచ్ పింకు రంగు పట్టుపరికిణీ, అదేరంగు రష్యన్ జార్జెట్ ఓణి తెచ్చి, "ఇవి కట్టుకో వదినా. ఎంత సన్నంగా ఉన్నావో నువ్వు!" జడవిప్పి ఆ ఉంగరాల కురులని రెండు జడలుగా వేసిందిరేఖ. లాన్‌లోకి పరుగెట్టి, రెండు గులాబీలు తెచ్చి తలలో తురిమింది. "ఆడవాళ్ళ తయారయే సరికి, మాటు మణుగు తుందిట" అని ప్రసాద్ అంటూంటే సరళ కోపంగా రేఖవైపు చూసింది "అపాలజీ ఇచ్చుకో" అన్నట్టు. "ఒక్క నిమిషం అన్నయ్యా. వదిన్ని ఇప్పుడు గుర్తుపట్టగలవా?" అంటూన్న రేఖ బుగ్గమీద చిటికవేసి వెళ్ళి పోయారు ఇద్దరూ.

అన్నా, వదినా ఎంత చక్కని జంట అనుకుంటూ ఏదో ఊహాలోకంలో తేలిపోసాగింది రేఖ. అన్నయ్యలా ఉండాలి. మీనా లాంటి మేనర్సు ఉండాలి. అలాంటి ఫారిన్ రిటర్న్‌డ్ వ్యక్తినే పెళ్ళాడాలని అనుకుంది. లేక పెళ్ళయాక పైదేశం పోతేనో? అంత అదృష్టమా తనకు? కాని మీనాని చూస్తుంటే, పైదేశం పోవాలనే కోరిక బలీయమై పోసాగింది.

* * *

దీపావళివచ్చింది. అక్కా, బావా కూడా వచ్చారు. ఇల్లంతా ముగ్గులతో కళకళ లాడుతోంది. రాత్రి దీపాలంకరణ అంతా రేఖదే. సరళ కాండిల్ వెలిగిస్తూంటే, ఆ వెలుగులో ప్రసాద్ ఆమె ముఖంచూచి ముగ్ధుడవుతున్నాడు. "వదినా, నీవని ఆ ఒక్క కాండిల్ వెలిగించడమే. నువ్వు దాన్ని వెలిగించే సరికి మిగిలిన వన్నీ ఆరి పోతాయి." రేఖ అంటూంటే సరళ సిగ్గు పడింది. చిలిపి అక్కా

# సయోనారా

వసి అంతే అయింది. ఆఖరునపెద్ద ప్రమిదలో రెండువత్తులు వేసి వెలిగించింది రేఖ. దూర దేశాల్లో ఎక్కడో తనను వరించే మన్మథు డున్నాడని తలచుకుంటూ ఆరెండింటినీ ఒకటి చేసింది. నిశ్చలంగా దానివైపు చూస్తూంటే "రేఖా! ఇప్పుడు నువ్వు అక్కడ నిలబడి అయిదు నిమిషాలయింది తెలుసా?" అంది లీల వాచీ చూసుకుంటూ. రేఖ మనసంతా ఏదో మధుర భావనతో నిండి పోయింది.

* * *

మూడు దీపావళిలు కాలగర్భంలో కలిసి పోయేయి. ఇప్పుడు రేఖా, మీనా, ఉషా అందరూ ఎమ్మే ఫైనల్ ఇయర్‌లో ఉన్నారు. అందరూ సీరియస్‌గా చదువుతున్నారు. ఢిల్లీ యూనివర్సిటీ ఎంతో ప్రశాంతంగా ఉంటుంది. చదువు కోడానికి లైబ్రరీ ఎంతో ప్రశాంతంగా లోకంలో ఉన్న జ్ఞానం అంతా అక్కడే పొందు పరచి నట్లుగా ఉంటుంది. అక్కడ కూర్చుని వ్రాసుకుంటూంటే గంటలు నిమిషాల్లో పాకిపోతాయి. ఒక్కోసారి పట్టుక్కున కలం ఆగిపోతుంది.

"ఇలా చదువు కుంటూ లెక్కలు వేయడమేనా పని? జీవితంలో తనకి ఇంకేంలేదా? ఎవరికోసం నిరీక్షిస్తోంది తను?" ఇలాసాగిపో తుంటాయి ఆలోచనలు. ఏదో ఆలోచించి వ్రాయ బోయి న రేఖ ఉలిక్కిపడింది. మీనా వచ్చి ఎదురుగా నిలబడింది. ఏమిటన్నట్టుగా చూసింది రేఖ. మవునంగా రమ్మని సైగచేసింది. మీనా ఇద్దరూ లైబ్రరీ దాటి ఆవరణలోకివచ్చారు. మవునంగా నడుస్తున్నారు. మీనా తనూ ఎంత సన్నిహితులైనా ఏదో ఒక అందమైన అడ్డు ఉంది ఇద్దరిమధ్యా. ఎవరూ హద్దుమీరి ప్రవర్తించరు. తను ఒకనాడు మీనా బాయ్ ఫ్రెండుని చూసింది. తరువాత ఎంతో తెలుసుకోవాలన్న కుతూహలం ఉన్నా కూడా ఏమీ అడగలేదు మీనాని. అలాగే మీనాకూడా ఎంత అందంగా సున్నితంగా ప్రవర్తిస్తుంది. అలనాడు తన ఏలం వసర్చి చూచి తప్పుగా అర్థం చేసుకుంది. మరి తను కూడా విడమర్చి చెప్పాలని ప్రయత్నించలేదు. ఏమనుకుందో ఏమో. కాని నాలుగు సంవత్సరాలుగా రోజూ కలుస్తున్నా ఇలాంటి విషయం ఎప్పుడూ ప్రస్తావించలేదు ఇద్దరూ. కాని ఇవాళ మీనా ఏదో గాభరాగా ఉన్నట్లు కనిపించింది రేఖకి. మీనా ఆగింది. రేఖ తలెత్తిచూసింది. ఎదురుగా ఒకవ్యక్తి నిల్చుని ఉన్నాడు. యూనివర్సిటీలో ఎక్కడో చూసినట్లనిపించింది. కాదు కాదు ఎన్నో ఏళ్ళయింది చూసి, అనుకుంది. ఇంతలో "హింఖాజ్ మై ఫ్రెండ్ విజయ్, షితాశ్ మై డియరెస్ట్ ఫ్రెండ్ రేఖా!" అన్న మీనా పరిచయ వాక్యాలు విని "గ్లాడ్‌టు మీట్‌యూ" అంది రేఖ. అతను చిరునవ్వునవ్వి ఊరుకున్నాడు. ఇంతలోఅతను ఒక కవరు తీసి మీనాకి ఇవ్వబోయేడు. ఆమె తీసుకోలేదు. గిరుక్కున వెనుదిరిగింది. అతను రేఖచేతిలో పెట్టి వెళ్ళిపోయేడు. "సయోనారా......" అంటూ. ఆశ్చర్యంతో మీనాని కలుసుకోవాలని రెండడుగులు వేసింది. వెనక్కి తిరిగి తిరిగి చూసిన రేఖ అతని రూపం ఎక్కడోచూసినట్లనిపించింది.ఓఅదే. తను ఆనర్సు రెండవ సంవత్సరం చదువుతూండగా కాలేజీలో మేడమీద నిల్చునిచూస్తూంటే క్రిందని కారు దగ్గర మీనా, ఈవ్యక్తి నిలబడి ఉండడం జ్ఞాపకం వచ్చింది. అంతా అర్థమయింది రేఖకు. చేతిలో కవరుమీద 'మీనా' అన్న అక్షరాలు అందంగా దిద్దివున్నాయి. మీనాకి ఇచ్చేసింది దాన్ని ఆమె వెంటనే ముక్కలు ముక్కలుగా చింపేసింది.

"అదేమిటి మీనా?"

"అంతే రేఖా! నీదగ్గర్నుండి నేర్చుకున్న పాఠం అది."

రేఖకేం అర్థం కాలేదు.

"మీరు సౌత్‌ఇండియన్స్. ఎంతనియమం నిష్ఠతో ఉంటారో నాకు తెలిసింది. ఇన్ని సంవత్సరాలుగా నిన్ను చూస్తున్నా ఎంతో చలాకీగా ఉండి బెస్టు స్టూడెంటనిపించు కున్నావు. స్లో సైక్లింగ్‌లో ప్రైజు నీదే. మేధమేటిక్సు అసోసియేషన్ ప్రోగ్రాము అంతా నువ్వే అరేంజి చేసే దానివి. మేధమేటిక్సు హిస్టరీ అంతా సీరియల్ కథలాగా ప్రతి మీటింగులోనూ చెప్పే దానివి. లాన్‌లో కూర్చుని హిందీపాటలు పాడుతూ ఎంతో తన్మయం అవుతావు. కాని అంత వరకే. తరువాత ఏమిటీ అని ఆలోచించవు.'

# "ప్రియా ఇప్పుడు...నీకది నిమిషంలో సాధ్యపడుతుంది లీకోకి కృతజ్ఞతలు"

లీకో-స్వల్పమైన ధర. ఉపయోగించటం తేలిక. పొగలేని గృహసంబంధమైన వంటచెరకు, ఏ రకమైన వంట పాత్రకైనా తగినట్టిది.



చిన్న లీకో ముక్కలను వేసుకోండి



ఆ ముక్కలను మీ కుంపటిమీద పల్చని పొరలా అమర్చుకోండి.



ఈ లీకో పొరను అంటించండి.



ఆ పొర అంటుకొని మండటం ప్రారంభం కాగానే క్రమంగా లీకోను చేర్చండి.

# లీకో

కాలాన్ని మరియు ధనాన్ని పొదుపు చేస్తుంది.



LECO నైవేలి లిగ్నైట్ కార్పొరేషన్, లిమిటెడ్, నైవేలి-1.

FDS-NLC-711 TEL

# సయోనారా

చెప్పుకుపోతున్న మీనాని "మరినువ్వే ఏమిటంతలోచించి పాడేది?" అనడిగింది రేఖ.

"అదికాదురేఖా. నీలో ఇన్ని టేలెంట్స్ ఉన్నా అన్నీ గుప్తంగా దాచుకున్నావు. మీతలిదండ్రులు తెచ్చిన వ్యక్తిని వివాహ మాడబోతున్నావు. కాని నీకు నాకు ఎంతో స్వతంత్రం ఉంది. కాని నాలాంటివాళ్ళు నేను ఎన్నుకోవాలంటె కష్టమే మరి? సరి అయిన వ్యక్తి తారసపడేదాకా ఇలా ఫ్రెండ్సుని సొప్పించ వలసి వస్తోంది. అంతే" మళ్ళా తిరుగుతున్న కన్నీటినిదాచుకో ప్రయత్నించింది మీనా. రేఖ తనరుమాలుతో తుడుస్తూ "నీలో ఇంత ఘర్షణ పడుతున్నావనుకోలేదు. నువ్వు అందంగా ఆనందంగా తిరుగుతూంటే నువ్వే జీవితంలో సుఖానికి సంతోషానికి ప్రతిరూప మను కున్నాను. జరిగినవి మర్చిపో. కాని నీమనస్తైర్యాన్ని నిజంగా మెచ్చుకో వలసిందే" అంది. మళ్ళీ లైబ్రరికి వెళ్ళి పుస్తకాలు తీసుకుని బస్సుండుకి వెళ్ళేరు.

"రేపు శలవయినా లైబ్రరీ తెరిచే ఉంటుంది. తప్పకుండా రా" అని మీనా అంటూంటే "ఓకే. సయోనారా....." అంటూ బస్సెక్కింది రేఖ.

రాత్రి భోజనా లయేక లాన్ లో సోఫా టేబిలు వేయించుకుని కూర్చుంది రేఖ చదువుకుందామని. కాని మొదడు సాయంత్రం జరిగిన దాన్ని గురించే ఆలోచిస్తోంది. పెడస్టలు లాంపులోంచి వెలుతురు టేబిలు మీదికి ప్రసరిస్తోంది. గడ్డిపోచలు వింతకాంతితో మెరుస్తున్నాయి. చుట్టు ఉన్న మొక్కలు పువ్వులు అందంగా గాలికి ఇటూ అటూ ఊగుతున్నాయి. లాన్ లో కూర్చుని చూస్తూంటే తను యిల్లు కూడ ఎంతో అందంగా కన బడింది రేఖకు. లైట్లు అన్నీ ఆర్పే ఉన్నాయి. అన్నగారిదిలో తలుపు తెరచే వుంది. గాలికి కర్టెన్సు ఊగుతున్నాయి. ఆ గదిలో టేబిల్ లాంప్ వెలుగుతోంది. అంటే 'అన్నయ్య ఇంకా పడుకో లేదన్న మాట' అనుకుంది రేఖ. రెప్ప వాల్చకుండా తన లాంపు వైపు చూసింది రేఖ. అది తను ఉదయపూరు నుండి తెచ్చింది, పోయిన నెల. మీనాలా లేకులో బోటింగు చేసు [illegible] [illegible]

తను. ఆ లేక్ పాలెస్ ఎంతో అందంగా ఉంది. వెన్నెలలో అది తాజమహలు లాగే మెరిసి పోతోంది. బోటులో కూర్చున్న తను "ఏ రాత్ ఏ చాందిని ఫిర్ కహాఁ సున్ జా దిల్ కి దాస్తాం......" అని పాడింది. అందరూ తన్మయంగా విన్నారు. మీనాని పాడమని బలవంతం చేసేరు. "జిందగీ కితనీ ఖూబ్ సూరత్ హై, అయియే ఆప్ కి జరూరత్ హై......" అని పాడుతూంటే ఆమె కళ్ళల్లో నీళ్ళు నిలచేయి. దాంట్లో ఎంత అర్థం వుందో ఇప్పుడు తెలుస్తోంది రేఖకు. కాని తనకి ఎవరు అవసరమో ఇప్పటికి తెలియదు. ఆకాశంలో చంద్రుణ్ణి చూస్తూంటే తనకు కావలసిన వ్యక్తి అంత దూరంలో ఉన్నాడేమో అనుకుంది. మర్నాడు అందరూ షాపింగుకి వెళ్ళి పోయేరు. తను ఆలస్యంగా లేచింది. బజారులో వెళ్తూ ఉంటే మళ్ళీ నీటి ఒడ్డుకే వచ్చి చేరింది. సరే అని బోటు ఎక్కి ఆ లేక్ అంతా మరో మారు చుట్టి వచ్చింది, తను. ఆ పడవవాడు చెప్పేడు, "ఒకసారి ఈ నీళ్ళు త్రాగితే మళ్ళా వస్తారు" అని. బస్సు దగ్గరకి వచ్చి చూసే సరికి అందరూ క్రసావూను బుట్టలతో సహా కొని తెచ్చుకున్నారు. తను ఎంతో బాధపడింది. తన మీద తనకే కోపం వచ్చింది. "నీళ్ళ, బోటింగ్ అని పడి చచ్చేను. ఇప్పుడు ఇంటికి తీసుకు వెళ్ళ డానికి ఏమీ లేదు" అని వాపోయింది. మధ్యాహ్నం పెర్మిషను తీసుకుని మీనాతో బజారు కెళ్ళి క్రసావూను కొంది. ఎంతో బాగుంటుంది క్రసావూను మీద పెయింటింగ్ అక్కడ.. ఉదయపూరు దీనికి పెట్టింది పేరు. ఇంతలో ఈ పెడస్టలు లాంపు మీనా చేసిన ఎన్నికే అని గుర్తుకొచ్చింది. "పాపం మీనాని తనెంత అపార్థం చేసుకుంది? మరి మీనా తనని ఏమంది ఇవాళ? తను పెద్దలు నిర్ణయించిన వ్యక్తినే వివాహ మాడుతుందిట. అవును ఎక్కడ ఢిల్లీ ఎక్కడ వైజాగ్? కాని తను మారలేదు ఏ విధంగా కూడా. మరి తల్లిదండ్రులు తెచ్చిన వ్యక్తి తన అభిరుచుల్ని గుర్తించక పోతే? తన టేలెంట్సు అన్నీ వ్యర్థమయి పోవూ? మరి దేని మీద ఆధార పడి ఇంతకాలం నిశ్చింతగా వుంది తను? [illegible] తల్లిదండ్రులు [illegible] [illegible] తను అనుభవించ

వేధిస్తోంది. [illegible] ఒక వేళ తన జీవితం నరకం అయిపోతే? మరి అక్క బావగారూ, అన్నా, వదినా అందరూ సుఖంగా ఎలా ఉన్నారు? తల్లిదండ్రులు నిర్ణయించిన వేగా?" రేఖ మనసంతా భయంతో నిండి పోయింది. ఏమీ అంతు పట్టు లేదు.

"ఇంకా పడుకో లేదూ?" అంటున్న తల్లిని చూసి ఈ లోకంలోకి వచ్చింది సురేఖ. రాత్రి పన్నెండయింది. ఏమీ చదవ లేదనుకుంటూ వెళ్ళి నిద్ర కుపక్రమించింది. "రేపు తప్పకుండా యూనివర్సిటీకి వెళ్ళాలి"ను కుంది, "యూ మస్ట్ కమ్ టుమారో" అన్న మీరా మాటలు గుర్తు కొస్తుండగా.

"రాణీగారు ఇంకా లేవలేదా? రేపటి నుండి ఆలస్యంగా లేవచ్చు కలలు కంటూ! కానీ, ఇవాళ మాత్రం వేగిరం లేవాలి" అని సుప్రభాతం పలికింది సరళ. కళ్ళు తెరచి చూసే సరికి తలంటు పోసుకుని కాఫీ త్రాగుతూ నవ్వుతున్న వదిన మోహం కన బడింది రేఖకు. "నువ్వు కనబడితే అది సుప్రభాతం కాక మరేమవుతుంది?" అంటూ లేచింది.

"వేగిరం తలంటు కో" అంటున్న తల్లిని చూసి "ఇవాళ లైబ్రరీలో చదువు కోవాలి. రేపు పోసుకుంటాను" అంది రేఖ.

"ఇవాళ ఇల్లు కదలడానికి వీల్లేదు." అంది తల్లి.

ఆశ్చర్య పోతూ తలంటుకుని కొత్త చీర కట్టుకుంది రేఖ.

కాఫీ తాగుతూ పేపరు చూడసాగింది. ఇంతలో కారు హారన్ వినపడింది. కిటికీ దగ్గర కెళ్ళి చూసింది. ఎవరో ఇద్దరు వ్యక్తులూ, వాళ్ళ వెనక ఇద్దరాడ వాళ్ళూ వాళ్ళని సాదరంగా ఆహ్వానిస్తున్న అన్నయ్య కనబడ్డారు. అప్పుడు తెలిసింది తనను వాళ్ళు చూడడానికి వచ్చేరని. కాఫీలు, స్వీట్సూ అందరికీ ఇచ్చింది. అతని వైపు చూసింది ఒకసారి. గుండె గుభేలు మంది. ఎంత తీక్షణంగా ఉన్నాయా చూపులు! వాళ్ళు వెళ్ళిపోయేక 'అబ్బాయి లక్షణంగా ఉన్నాడని' మురిసి పోయేరు అమ్మా నాన్నా. సాయంత్రం వెళ్ళి నాన్నగారు కలుసుకుని వాళ్ళ అంగీకార వార్త ఇంట్లో అందరికీ చెప్పేరు. ఇదొక శుభ దీపావళిలా ఉంది అందరికీ. కాని ఈ నరకచతుర్దశి తన పాలిట నరకం లేదుకదా అని భయపడింది రేఖ. రేఖ మనసు [illegible] పోయింది. "ఎక్కడో నా ఫారిన్ రిటర్న్‌డ్ వ్యక్తి? చంద్రుడంత దూరంగా ఉన్నాడను కున్నానే? కాని ఇక్కడే, ఇండియాలో కాదు కాదు ఢిల్లీలోనే ఉద్భవించే దేమిటి? మరి స్మార్ట్‌గా ఫారిన్ స్టైల్లో మాట్లాడే మనిషి కాదు...." కొంచెం ఆశా మరి కొంచెం నిరాశతో ఆలోచిస్తోంది రేఖ.

* * *

"అమ్మగారి పని కుదిరింది. ఫారిన్ రిటర్న్‌డ్ వ్యక్తి, రిఫ్రిజిరేటరు, కారూ గల వ్యక్తినే కావాలన్నారు తమరు! మరి దీనికి ఎలా ఒప్పుకున్నావమ్మా?" అని సరళ ఎగతాళి చేస్తూంటే కళ్ళల్లో నీళ్ళు నిలిచేయి రేఖకి. అవును. తను ఈ సంబంధానికి ఎలా ఒప్పుకుంది. కాని మరి ఎలా వద్దన గలదు? ఏం లోపం ఉందని? అలా అని ఇంకెవరినైనా చేసుకోవాలనిలేదు. అంటే తనలోనే, తన ఆలోచనల్లోనే లోపం ఉందా? అయితే తన ఆశలకు "నమోనారా.." చెప్పాల్సిందేనా? ఏమీ తేల్చుకోలేక పోయింది.

మర్నాటి రాత్రి దీపాలు వెలిగిస్తూ పెద్ద ప్రమిదలో వత్తి వేసి రెండు వత్తులు వేసి వెలిగించి వాటిని ఉంచింది భక్తితో. అవును. రెండు వత్తులూ ఒకేసారి వెలిగితే రెండింటి బాటలూ ఒకటే అవుతాయి. ఇదే తన సమస్యకు పరిష్కారం. భక్తితో కళ్ళు మూసుకుంది సురేఖ. కారు హారన్ విని త్రుళ్ళి పడింది. ఎవరూ? వాళ్ళే వస్తున్నారు! దీపాల మధ్యలో పట్టు చీరలో మెరుస్తూ నిల్చున్న రేఖ మోహన్‌కి అప్సరసలాగే కనబడింది. ఒక శుభ వార్త ఎలా చెప్పాలా అని ఆలోచిస్తు న్నాడు. ఇంతలో "మా అన్నయ్యకి వెస్ట్ జర్మనీలో పి.హెచ్‌డి. చెయ్యడానికి స్కాలర్‌షిప్పు వచ్చింది. ఫేమిలీతో సహా వెళ్ళిపోతాట్ట!" అని గర్వంగా చెబుతున్న శైల వైపు ఆశ్చర్యంగా చూస్తూంటే, దీపంలో పడబోయిన పమిటను పట్టుకున్నాడు మోహన్. గాభరాగా వెనుదిరిగిన రేఖకు నవ్వుతున్న మోహన్ కనిపించాడు. ఆ కళ్ళల్లో తన ప్రతిబింబం కనబడగానే "భగవాన్, నా కలలన్నీ నిజమయ్యాయి!!!" అని జ్యోతికి అంజలి ఘటించింది సురేఖ ●



# వస్తువులను పెట్టుటకు ఖీరా క్యాబినెట్లు !

ఖీరా క్యాబినెట్లు త్రుప్పుపట్టని, ముక్కలుగా ఊడని ఉక్కు నుండి ఎంతో అందమైన ఫినిష్‌తో తయారు చేయబడ్డాయి. ఇవి ఎన్నో ఏళ్ల పాడవకుండా మన్నుతాయి. మీ విలువైన వస్తువులను భద్రముగా పెట్టుకొనుటకు ఖీరా స్టీల్ క్యాబినెట్లు ఎంతో అనువుగా ఉంటాయి. ప్రతి క్యాబినెట్‌కు గట్టిగా తాళము పడే ఏర్పాటు ఉంది. మీకు కావాలంటే వీటి షెల్ఫులను మార్చి పెట్టవచ్చును మరియు అదనపు హంగులను పెట్టుకోవచ్చును. ఆఫీసులో లేక ఇంట్లో, ఎక్కడైనాసరే, మీ వస్తువులను భద్రముగా పెట్టుకొనుటకు ఖీరా క్యాబినెట్లనే కొనండి!



'యుటిలిటి': 1971 మి.మీ. x 910 మి.మీ.x 481 మి.మీ. (78"x36"x19")



'పాప్యులర్': 1641 మి.మీ. x 831 మి.మీx 481 మి.మీ. (65" x33"x19")



'మిడ్జెట్': 1270 మి.మీ. x 760మి.మీ. x 481 మి.మీ. (50" x 30"x19")

IWT-KSW-4893




ఖీరా స్టీల్ వర్క్స్ ప్రైవేట్ లిమిటెడ్
స్వామి వివేకానంద రోడ్, సాంతాక్రుజ్, బొంబాయి-54

# కమ్యూనిస్టు దేశాలలో కాంగ్రెస్ అధ్యక్షుడు కామరాజ్

(గత సంచిక తరువాయి)

ఆర్. వెంకట్రామన్

తమిళనాడులో వున్న మెట్టూరు టన్నెల్ విద్యుదుత్పత్తి నిలయం, ఉత్తర భారతంలో వున్న హీరాకుడ్, భాక్రానంగల్ విద్యుదుత్పత్తి కేంద్రాలు వీటికి కావలసి కొన్ని భారీ యంత్రాలను రష్యా సరఫరా చేసి సహాయం చేసింది. ఆ భారీ యంత్రాలను తయారు చేసే కర్మాగారం ఒకటి లెనిన్‌గ్రాడ్‌లో వుంది. కామరాజ్ ఆ కర్మాగారానికి వెళ్ళారు.

మనకు కావలసిన పరిశ్రమల యంత్రాలను సరఫరా చేయడం మాత్రమే కాక, మన దేశపు ఇంజనీర్ల విషయాలకు శిక్షణ కూడా ఇస్తున్నది ఈ కర్మాగారం.

"ఇంతవరకు 74 మంది భారతీయ ఇంజనీర్లకు శిక్షణ ఇచ్చాము" అని ఆ కర్మాగారం అధికారులు అన్నారు.

కర్మాగారంలో ప్రవేశించగానే కామరాజ్‌కు అక్కడ వ్రేలాడుతున్న లెక్కలేనన్ని ఫోటోలు కనిపించాయి. ఆ ఫోటోలో వున్నవారెవరా అని కామరాజ్‌కు కుతూహలం కలిగింది.

ఎవరై వుంటారని వూహించ వచ్చు? అకౌంటెంట్, మేనేజింగ్ డైరెక్టర్, జనరల్ మేనేజర్, ప్రధాన ఇంజనీయర్, ఇలాటి వారి ఫోటోలే అయివుంటాయని కదూ అనుకుంటారు!

అలా మీరు భావించేటట్లయితే పొరపాటే. అక్కడున్న ఫోటోలు చాలమట్టుకు అక్కడ పనిచేసే కార్మికులవి. దీక్షతో స్థిరంగా పనిచేసే కార్మికుని ఫోటో, కొత్త యంత్ర భాగాలు కనిపెట్టిన కార్మికుని ఫోటో, పని గొప్పగా చేసిన కార్మికుని ఫోటో— ఈ విధంగా లెక్కలేని పటాలు అక్కడ చూడవచ్చు. ఇలాటి గౌరవం పొందడానికి పోటీతో కార్మికులు అక్కడ పని చేస్తున్నారని అధికారులు అన్నారు

తర్వాత లోపలికి వెళ్ళగానే, ఒక గదిలో కార్మికులు తయారు చేసిన కొత్త యంత్రాలు, వారు కనిపెట్టిన కొత్త యంత్రాలు, పాత యంత్రాలలో వారు చేసిన మార్పులు— ఇవన్నీ ఆయా కార్మికుల పేర్లతో పాటు ప్రదర్శన వస్తువులుగా ఉంచబడ్డాయి. కార్మికులు శ్రద్ధతోను, ఉత్సాహంతోను పని తెలుసుకొనడానికి, పరిశ్రమ అభివృద్ధి పొందడానికి ఇలాటి పద్ధతులు చాల ఫలితం కలిగిస్తున్నాయని నిర్వాహకులు తెలిపారు.

"ఎక్కువ వేతనం పొందడమే కార్మికుని లక్ష్యం" అనే భావాన్ని మార్చి, "పరిశ్రమవల్లనే, ఉత్పత్తి అధికం కావడం వల్ల కార్మికులు పొందే ప్రశంసలే మేలయినవి" అనే భావాన్ని అక్కడ కలిగించారు నిర్వాహకులు.

ఆంగ్లకవి మిల్టన్ తన ఒక కవితలో ఈ విషయం సూచించారు:—

"Fame is spur that the clear spirit doth raise.

(That last infirmity of noble mind.)

To scornde lights, and live laborious days."

దీని తాత్పర్యమేమిటంటే, ఉత్తమ పురుషులు ప్రశంసలు పొందడానికి రాత్రి పగలు పరిశ్రమ చేస్తారు— అని.

ఈ కవిత ప్రాతిపదికతోనే, సమర్థులైన కార్మికుల ఫోటోలను పెట్టడం, కార్మికులు కనిపెట్టినవి ప్రదర్శనంలో చేర్చడం వంటి పనులు సోవియట్ దేశంలో జరుగుతున్నాయేమో అని నాకు తోస్తుంది.

జాతీయం చేయబడిన మన ప్రభుత్వ కర్మాగారాలలోను దీనిని అనుసరిస్తే ఫలితం వుంటుం దనే భావాన్ని ప్రకటించారు కామరాజ్.

ఆ కర్మాగారాన్ని తిరిగి చూచిన పిదప సోవియట్ కార్మికుల 1/8, పరిశ్రమను ప్రశంసించారు కామరాజ్. పరిశ్రమ వల్లనే దేశం పురోగమిస్తుందన్న విషయాన్ని సోవియట్ కార్మికులు ప్రపంచానికి నిరూపించి చూపారని కర్మాగార నిర్వాహక్వాధికారులతో కామరాజ్ చెప్పారు.

కర్మాగారం చికిత్సా విభాగానికి నిర్వాహకులు కామరాజ్‌ను పిలుచుకుని వెళ్లారు. అక్కడ కార్మికుల శరీర పరీక్షలకు, చికిత్సకు అవసరమైన పెక్కు నవీన పరికర పరికరాలు కనిపించాయి.

ఆ చికిత్సాగారాన్ని చూచేటప్పుడు నేను, కామరాజ్ డాక్టర్లుగా మారిపోయాము. అవును! డాక్టర్ల లాగానే, మాకు కూడా పెద్ద అంగరఖా, ముఖానికి తొడుక్కునే బురఖా వంటిది మాకు ఇచ్చారు. వ్యాధిక్రిములు తగులకుండా వారు తీసుకునే ముందు జాగ్రత్తలివి. లోపల ప్రవేశించే వారికందరికీ అలాటి దుస్తులు ఇస్తున్నారు. ఇది శ్రేష్ఠమైన పద్ధతి కదా?

అక్కడ జబ్బు తగిలి పడుకుని వున్న ఇద్దరు కార్మికుల వద్దకు కామరాజ్ వెళ్ళి, వారి యోగక్షేమాలు కనుక్కున్నారు. అప్పుడా కార్మికులు పొందిన సంతోషం చెప్పలేనిది.

మాస్కోలో లాగే లెనిన్‌గ్రాడ్ లోను భూగర్భ రైలు చాల ప్రసిద్ధమైనది. ఆ రైలులో ప్రయాణం చేయడానికి ఆ ఉదయం అవకాశం కలిగింది. భూమిలో సుమారు 300 అడుగుల లోతున నిర్మాణమైన ఈ రైలు దారిపై బళ్ళు విద్యుచ్ఛక్తితో నడుస్తున్నాయి. ఎలాటి అడ్డము అంతా లేందున రైళ్ళు చాలా వేగంగా నడుస్తాయి.

లెనిన్‌గ్రాడ్ భూగర్భ రైలులో తక్కిన అందరు ప్రయాణికుల లాగే నేను, కామరాజ్ ఎక్కాము. రైలు పెట్టె పరిశుభ్రంగా వసతిగా వున్నది. ప్రత్యేకంగా పరిశీలించారు కామరాజ్.



లెనిన్‌గ్రాడ్‌లో మొట్టమొదటి సోవియట్ సమావేశమయిన స్థలం

భాగాన్ని రైలును తిరగడానికి "ఎస్కలేటర్" అనే సాధనం వుంది. ఇది సాధారణంగా మెట్లలాగ కనిపిస్తుంది. దాని మీద ఎక్కి నిల బడితే, అది తనంతట తానె క్రిందికి దిగిపోతుంది. ఈ మెట్ల మీద— ఒక్కొక్క దాని మీద వరు వరుసగా— ఒక మంది నిలబడి క్రిందికి వెళ్ళ వచ్చు. అదే విధంగా క్రింది నుంచి వెలుపలికి రాదల చిన వారు మెట్ల మీద నిలబడితే, ఎస్కలేటర్ తనంతట తానె పైకివస్తుంది. ఈ ఎస్కలేటర్లను

## కామరాజ్

వేరు విదేశాలలో ప్రతిచోట చూడవచ్చు.

జపాన్ నుంచి మద్రాసుకు వచ్చిన ఒక వస్తు ప్రదర్శన నౌకలో ఈ 'ఎస్కలేటర్' ఏర్పాటు చేశారు. ఆ నౌకను చూచే అవకాశం కలిగిన మద్రాస్ నగర వాసులకు 'ఎస్కలేటర్' గురించి తెలిసి వుంటుంది.

రష్యా విప్లవం లెనిన్‌గ్రాడ్‌లోనే ఆరంభమయింది. విప్లవం ఆరంభం కావడానికి గుర్తుగా "అరోరా" అనే నౌక నుంచి ఒక ఫిరంగి గుండు ప్రేల్చ బడింది. వెంటనే విప్లవకారులు అప్పుడున్న "కెరన్‌స్కీ" ప్రభుత్వాన్ని పడదోసి, సోవియట్ పరి పాలనను నెల కొల్పారు.

ఆ "అరోరా" నౌక చూడడానికి కామరాజును పిలుచుకుని వెళ్ళారు. నౌక కెప్టెన్ సైనిక మర్యా దలతో కామరాజుకు స్వాగతం చెప్పి లోపలికి పిలుచు కుని వెళ్ళి నౌక చూపించారు.

ఇప్పుడు ఆ నౌక నావికుల శిక్షణకు వినియో గించ బడుతున్నదని ఆ కెప్టెన్ తెలిపారు.

లెనిన్ నివసించిన "స్మోల్ని" మేడను, అక్కడ జరిగిన ప్రథమ అఖిల రష్యా సోవియట్ మహాసభ గదులను కామరాజ్ చూచారు. లెనిన్ ఉపయో గించినవి చాల సామాన్యమైన గదులు. మేజా బల్లు కుర్చీలు— అన్నీ అలాగే ప్రదర్శన వస్తువులుగా పెట్టబడి వున్నాయి.

జార్ చక్రవర్తులు నివసించిన ప్రాసాదాన్ని "హెర్మిటాజ్" అని వ్యవహరిస్తారు. అది నేడు, ప్రపంచంలోని ఉత్తమ ప్రదర్శన శాలలలో ఒక్కటిగా విరాజిల్లుతున్నది. ప్రపంచంలో వున్న శ్రేష్ఠమైన గ్రీకు, రోమ్ సామ్రాజ్యాల శిల్పాలన్నిటినీ విడి విడిగా ఆ ప్రాసాదంలో ప్రదర్శించారు. మహా విఖ్యాతులయిన మహా చిత్రకారులు రెంబ్రాండ్, రూబెన్ వంటి వారి చిత్రాలు ఆ రాజనగరులోని పెక్కు గదులను అలంకరించాయి. ఇంకా, బంగారు నాణ్యాలు, బంగారు నగలు, జార్ చక్రవర్తులు ధరించిన వజ్రాలు, పచ్చలు, కెంపులు మొదలయిన నవరత్నాలు మొదలయినవి మరొక చోట ప్రద ర్శించ బడ్డాయి. ఇంకొక చోట, ఆ కాలపు తూగు దీపాలు గంభీరంగా వ్రేలాడుతున్నాయి.

హెర్మిటాజ్ ప్రాసాదంలో ఒక భాగం "గోల్డెన్ రూమ్" అని వ్యవహరించబడుతుంది. ఇది బంగారు ములామా చేసిన గది. ఆ గది చాలా అందంగా వుంది అని చెప్పినంత మాత్రాన చాలదు. ఆ అందాన్ని చూచి అనుభవించి, అర్థం చేసు కోవాలి.

కళ్ళు జిగేలు మనే ఈ దృశ్యాలన్నీ కామరాజ్ దృష్టిని ఆకర్షించాయి. కాని, ఇవన్నీ చూచి ఆయన పారవశ్యం పొందలేదు. ఏవో ప్రదర్శన వస్తువు లను చూచే సాధారణ కుతూహలమే వారికి కలిగింది. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోని ప్రజలతోను, కార్మిక సంఘ కార్మికులతోను సమావేశమయిన ప్పుడు ఆయనలో కలిగిన కుతూహలం, ఉత్సాహం, చిత్ర శిల్పాలనో, ఆభరణాలనో చూచేటప్పుడు ఆయనలో కనిపించ లేదు.

ఈ విషయం మా వెంటవచ్చిన రష్యా వారికి అర్థమయింది. భారత్— సోవియట్ సాంస్కృతిక సంఘం ఉపాధ్యక్షులు ఈ విషయాన్ని పేర్కొని "కామరాజ్‌కు ప్రజల ఉత్తమ జీవితమే ముఖ్యమని అనడం పూర్తిగా నిజం. హెర్మిటాజ్ రాజప్రాసా దాన్ని చూచినప్పుడు ఆ నిజం నాకు చాలా బాగా బోధపడింది" అని అన్నారు.

ఆ నాటి సాయంకాలమే మేము మాస్కోకు ప్రయాణమయ్యాము.

(సశేషం)

—అనువాదం, తి. రా.

[ఆనందవికటన్ సౌజన్యంతో]

# కుసుమ-కోమలం



కుసుమం వంటి కోమలం, పూబంతి వంటి సౌందర్యం. హిమాలయా బుకే స్నో వల్ల మీ చర్మ సౌందర్యం అంత మనోహరం. దాని మృదులత మీ చర్మాన్ని మునుపటికంటె అతి కోమలంగా వుంచుతుంది...పట్టు వంటి కోమలం. పౌడరును ఎంతో చక్కగా అంటి యుంచుతుంది కూడా. ఆ పరిమళమేమో!
కోమలం, సౌమ్యం, దివ్యం.
కుసుమం వంటి కోమలం, పూబంతి వంటి సౌందర్యం.......!






...అట్టి మనోహరమైన చర్మసౌందర్యం కోసం

## హిమాలయా బుకే స్నో

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి శ్రేష్ఠమైన ఉత్పత్తి.

లింటాస్-HBS. 34A-140 TL

# వారఫలం

**16-12-1966 శుక్రవారం మొదలు 22-12-1966 గురువారం వరకు.**

**మేషం :** వారం ప్రారంభంలో అన్ని వ్యవహారాలు అనుకూలంగానే ఉంటాయిగాని వారాంతంలో చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదంవుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో చికాకులు ఏర్పడతాయి. వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం తగదు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో శ్రమపడినా, మాట దక్కదు.

**వృషభం :** వృత్తి వ్యాపారాల్లో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు కొంచెం శ్రమమీద నెరవేరుతాయి. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం :** భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలకంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలుకూడా లాభించగలవు. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కర్కాటకం :** వృత్తి వ్యాపారాల్లో ఆందోళన కలిగించే పరిస్థితులు యేర్పడి వారం మధ్యలో సర్దుకొంటారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడంవలన మున్ముందు ఇబ్బంది కలుగుతుంది. పెటివారిలో గౌరవం లభిస్తుంది. కోర్టు వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరుతాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**సింహం :** ఏ వ్యవహారంలోనూ ఆరంభంలో కనిపించిన అనుకూలత ఆఖరువరకు నిలవదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో అకారణంగా అపోహలకు గురి కాగల ప్రమాదం ఉంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**కన్య :** వృత్తి వ్యాపారాల్లో మీరు అనుకోనిదొకటి జరిగే మహాపాటి కావచ్చును. ఎవరితోను మాట పట్టింపులు తగవు. నూతన వ్యాపారాలు స్వల్పంగా లాభిస్తాయి. కొన్ని వ్యవహారాల్లో అధిక వ్యయం జరగడంవలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. సాంఘిక కార్యక్రమాలకు మార్పులు వస్తాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు వస్తాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**తుల :** కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభించగలవు. ఆర్థిక వ్యవహారాలు బాగాఉంటాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగాఉండదు. పెటివారిలో గౌరవం బాగా ఉంటుంది.

**వృశ్చికం :** మీ స్వంత పనులు సులువుగానే నెరవేరుతాయిగాని ఇతరుల నిమిత్తం శ్రమ పొందవలసివస్తుంది. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి ఫలించగలదు. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**ధనుస్సు :** భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లాభిస్తాయి. వృత్తిలో పెటివారి పోటీని ఎదుర్కొని అనుకూలతను సాధించగలరు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు శ్రమమీద నెరవేరుతాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. పెటితోవారితో వాద ప్రతివాదాలకు దిగడం తగదు.

**మకరం :** వృత్తి వ్యాపారాల్లో ఆదాయంతో పాటు వ్యయంకూడా పెరుగుతుంది. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. నూతన వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. ఉద్యోగంలో మీ మంచితనమే ఇబ్బందిని కలిగిస్తుంది. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు బాగా ఉంటాయి. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**కుంభం :** ఇదివరకు మీ కార్యక్రమాల్లో ఏర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. భాగస్వామ్యం చేసే వ్యాపారాలు ప్రారంభించడానికి యిది సమయంకాదు. ప్రయాణాలు శ్రమగలిగి ఫలిస్తాయి.

స్త్రీలకు— స్వల్ప అనారోగ్యం చేస్తుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం :** వారం ప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో చికాకులు ఏర్పడి తరువాత సర్దుకొంటాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందకపోవడంవలన ఇబ్బంది కలుగుతుంది. సాంఘిక వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. విలాస వస్తువులు కొంటారు.

—మహేష్

ఔషధం సేవించక ముందు



ఔషధం సేవించిన తరువాత



# జీవన్‌టోన్

గవర్నమెంటు

రిజిస్టర్డు నం. 218726

TRADE




MARK

ట్రేడ్ మార్కు

పత్రికలో ప్రకటించేసిన ఔషధాలను సేవించి, ఫలితాలను పొందనివారు అనేకులున్నారు. కావి జీవన్‌టోన్‌ను కొనుక్కొని దానిని ఉపయోగించి ప్రయోజనం పొందండి. జీవన్‌టోన్ కేవలం వనస్పతి కొవ్వునుంచి తయారు చేయబడింది. జంతువుల కొవ్వు చేరుటవల్లనే యీ అనుకోనటువంటి బలిష్ఠతకు కారణం అని కొందరు అనుకోవటం పొరపాటు.

## జీవన్‌టోన్ గుణములు

ఎంత మంచి ఆహారం తిన్నా, ఎముకల పోగువలె, బలహీనంగా ఉండేవారు కొంతమంది ఉన్నారు. అట్టివారికి జీవన్‌టోన్ మంచి బలాన్ని, లావును, బరువును ఇస్తుంది. ఆకలిలేని వారికి మంచి జీర్ణశక్తిని ఇస్తుంది. ఇది బలహీనత, కాళ్ళు చేతులు తేలిపోవుట, తల తిరుగుడు, రక్తహీనతలను పోగొట్టి పరిపూర్ణమైన దేహారోగ్యాన్ని, పుష్టిని ఇస్తుంది. శరీరం ఎరుపుచాయ పొందటానికి జీవన్‌టోన్‌తో టొమాటోలు తీసికోనండి. ఆరోగ్యవంతులకు కూడా జీవన్‌టోన్ మంచిది.

జీవన్‌టోన్ తీసుకొన్నప్పుడు మీరు కొంత శరీరవ్యాయామం చెయ్యటం అవసరం. లేకపోతే మీ శరీరం అనవసరంగా లావెక్కుతుంది. కావలసిన బరువు, బలిష్ఠత చేరినవెంటనే జీవన్‌టోన్ సేవించటం నిలపటం మంచిది. హృద్రోగులు జీవన్‌టోన్ తీసుకోవటం మంచిదికాదు. అట్టివారు జీవన్‌టోన్ తీసుకుంటే మేము బాధ్యులంకాము. స్త్రీలు బహిష్టుకాలంలో తీసుకొనకూడదు. ఇతర వివరాలు మందుతో పంపబడతాయి.

వెల : 450 గ్రాములు రు. 10/— (పోస్టుచార్జీలు రు. 3/—)

## స్కిన్‌లిమ్స్

యవ్వన సౌందర్యం కలిగియుండటం వరప్రసాదం. స్కిన్‌లిమ్స్ మీ చర్మాన్ని, మొటిమలు, పొటిలోపు మచ్చలు, వివర్ణత, కోతలు, శోభినుంచి కాపాడుతుంది. స్కిన్‌లిమ్స్ ముఖమందలి మడ్డి తొలగించిన తరువాత వాడవలెను. మీరు ఏ స్నోనుగాని, పౌడరునుగాని వాడవచ్చును. స్కిన్‌లిమ్స్ ఒక కోర్సు రు. 12/—.

Dr. VASAN,

**JOTHI HOSPITAL**

P. B. No. 1413, 24, VENKATANARAYANA ROAD, T. NAGAR, MADRAS-17.



# పిన్ని

పెళ్ళకూరు జయప్రద



"పిన్నీ! వస్తున్నా పిన్నీ నువ్వు నాకు నా చంపల మీద బహూకరించిన వేళ్ళ గుర్తుల మధురస్మృతులతో ఇంతవరకు గుర్తుకొచ్చిన నేను చదువైపోయి నీ దగ్గరకు పరుగెట్టుకొస్తున్నాను. ఆనాడు కాదు నువ్వు చేయెత్తితే అమ్మమ్మ ఒడిలో దాగ వాణ్ణి..."

అలా వచ్చిన ఉత్తరంలోని ఆమాటలే పదేపదే చదువుకుంది జగదీశ్వరి. ఆమె కళ్ళ నుండి ఆనందభాష్పాలు చంపల మీదుగా జారిపోతున్నాయి. ఆమె పెదవులు వణుకుతున్నాయి. ఆ ఒక్క మాట కొరకు ఎంతకాలం నుండి ఎదురు చూసింది! చాలు చాలు, వాడికి తన మీద కోపంలేదు. అంతకంటె తను వినాలనుకున్న సంతోషకరమైన విషయమింకేముంది? ఎవరి ప్రకోపమూ తనను బాధపెట్టలేదు కాని ఎవరినైతే తను పదిసంవత్సరాలు తన చేతుల మీదుగా పెంచిందో వాడు వైమనస్యం వహిస్తే సరిపెట్టుకోలేకపోయింది. ఇన్ని ఏళ్ళుగా 'ఎప్పుడైనా వాడు రాకపోతాడా' అని తలుపులు బార్లా తెరిచి వుంచింది. తన విశ్వాసమెప్పుడూ తనను మోసం చేయదు. వాడీరోజు వస్తాడు."

"ఎంతవాడయి వుంటాడో! బి. ఏ. పాస్ అయిన నా కొడుకును ఎంతవుంది గౌరవిస్తారో! ఒంట్లు సరిగా చెప్పడం రాలేదని పిన్నిచేత మొట్టికాయలు తిన్న వాడి అడుగులకు ఎంతవుంది మడుగులొత్తారో... ఆ లెక్కలు, అవన్నీ చేయలేక ఎంతగా సతమతమయిపోయి చిక్కిపోయాడో బిడ్డ! అన్నిటి మధ్యా ఈ బీద పిన్ని, ఎవరి చేతిలో అయితే దెబ్బలు తినలేక పారిపోయాడో ఆపిన్ని, ఇంకా గుర్తుందా? ఎంత అదృష్టవంతురాలిని చేస్తున్నావురా."

ఈ ఇంటికొచ్చిన ఇంత కాలానికి ఆమె మనసు ఆనందంతో గంతులేసింది. అప్పుడే అక్కడకొచ్చిన తన పన్నెండేళ్ళ పెద్ద కొడుకును ఒళ్ళోకి తీసుకుని గట్టిగా ముద్దు పెట్టుకుంది.

"రాజా! ఈరోజు మీ అన్నయ్య వస్తున్నాడురా."

వాడు అమ్మవైపు నిర్లక్ష్యంగా చూస్తూ, "అన్నయ్యెవరు నాకు" అన్నాడు.

ఆమె వాడి బుగ్గలు నిమురుతూ అంది "నా పిచ్చితండ్రీ! నీ కేమీ తెలియదు. రమేషన్నయ్య లేడూ వాడురా."

రాజు ఒక్కమారు ఆశ్చర్యపోయి నోరు చప్పరించాడు.

"వాడు నా అన్నయ్యేంటి? నాలాగా నీ దగ్గరే వున్నాడా ఏం?"

తల్లి మనస్సు చివుక్కుమంది. తన కొడుకు మనస్తత్వం తెలిసినా వాడి మాటలకు ఎప్పటికప్పుడు ఆమె బాధపడుతూనే వుంటుంది.

అవును బాబూ! నీలాగ వాడు నా దగ్గర లేడు. నీలాగ వాడు నన్ను వేధించడం లేదు. నువ్వు మాత్రమే నా కొడుకువు. కాని నువ్వు నీ తల్లి బ్రతికుండగా ఆమె కేవిధంగానూ పనికిరావు. ఆమె శవానికి మాత్రం కొరివి పెట్టగలవులే.' ఆమె బాధను మనసులోనే దాచుకుని అంది—

"నీ మాటలకేంగాని ఈరోజు రమేష్ వస్తున్నాడు. గూడుబండి కట్టించుకువెళ్ళు స్టేషనుకు."

ప్రాణం తెలియనివాడు అని రోజులలో పది సంవత్సరాలన్నా విండని వాకు వాడి నప్పగించి వెళ్ళిపోయావు. తీరా పదిసంవత్సరాలు, పెంచాక, మమతలు పెంచుకున్నాక నిర్దాక్షిణ్యంగా నాదగ్గర నుండి లాక్కుపోయావు. వాడిని ఒక్క దెబ్బవేసే అధికారం నాకు లేదనికదూ అమ్మ అభిప్రాయమూ, నీ అభిప్రాయమూను. పోనీలే.. వాడిని ఒక్కమారు చూడాలని వుంది పంపించు..."

దానికి జవాబు వెంటనే వచ్చింది.

"పిచ్చి జగతీ! వివరన్నారు వాడిని నువ్వు కొట్టకూడదని. వాడు నీ కొడుకు. నాకన్నా ఇప్పుడనిపిస్తుంది. నువ్వు ప్రేమించినంతగా వాడిని నేను ప్రేమించడంలేదని. మీ బావ వాడిని దూరంగా వుంచడానికి ఇష్టపడ లేదు. అందుకే అక్కడనుండి తీసుకొచ్చాను. అలా అని నీ మీద మీ బావకు అవిశ్వాసమను కుంటేవ్. అదేంకాదు. ఇంకా ఇద్దరున్నా ఆయనకు వీడంటేనే ఎక్కువ ఇష్టం. ఎంతైనా మొదటి బిడ్డ కదూ.." అంటూ ఏమేమో వ్రాసింది. నాలుగురోజుల్లో వాళ్ళ ఆఫీసు ప్యూను చేత రమేష్‌ను పంపించారు. వాడు కొద్దిగా పెద్దవాడయ్యాడనిపించింది. కాని అల్లరి తగ్గలేదు. వాడి మీద చెయ్యి చేసుకోకుండా పదిరోజుల పాటు వాడితో చిన్నపిల్ల అడుకుంది. మరలా వాళ్ళ నాన్న కబురు చేయగా తనను ఆవేదనకు గురి చేసి వెళ్ళిపోయాడు.

ఆతర్వాత కొన్నిరోజులకు తనకు పెళ్ళి సంబంధం ఒకటి వచ్చింది. ఆయన పెద్ద భూస్వామి ఒక మూల పల్లెటూరిలో. చదువులేదు. కాని అందం వుంది. ముగ్గురు అన్నదమ్ములు వాళ్ళు తల్లితండ్రి లేరు. ఆఖరి వాడు పెళ్ళికొడుకు. అందమైన వాడని మురిసిపోయినా చదువు లేనివాడిని చేసుకోవడం ఇష్టంలేదని ఖచ్చితంగా చెప్పింది. సంస్కారం చదువుతో రాదమ్మా. ఎన్ని చదువులు చదివినా పొట్టకూటికే అన్నట్లున్న ఈ కాలంలో ఆస్తి వున్నప్పుడు చదువు లేకపోయినా ఫర్వాలేదు జగతీ" అన్న అమ్మ మాటలతో తనూ ఏకీభవించింది. ఫలితం అతనితో తన జీవితం ముడిపెట్టబడింది. 'పెళ్ళితోపాటు స్త్రీ తన వ్యక్తిత్వాన్ని వదులుకోవలసి వుంటుంది' అని తెలుసుకోవడానికి చాలాకాలం పట్టలేదు.

పెద్ద ఆస్తివుందని అమ్మ మురిసిపోయి నంత సేపు తీసుకోలేదు అది అరిపోవడానికి.

# పిచ్చి

ఆ ఆస్తిలో చాలా భాగం పెద్దన్న స్వార్జిత మవడంతో ఇంట్లో గొడవలతో కోపమొచ్చి వాళ్ళు విడిపోతూ తన ఆస్తి యావత్తూ తీసుకెళ్ళిపోయారు. తమకు మిగిలింది చాలా కొద్దిమాత్రమే. దానితో వ్యాపారం చేయా లనుకున్నారాయన. దాని కొరకు ఇంకొంత డబ్బు పుట్టింటి నుండి తెమ్మన్నారు.

తన పెళ్ళి చేయడానికి నాన్న ఎంత అవస్థలు పడ్డారో తనకు తెలుసు. పెద్ద కూతురిని పెద్ద ఇంటికి పంపించడంతో ఆయన ముసలివాడయ్యాడు. ఇప్పుడు, రెండో కూతురి పెళ్ళి కొరకు కట్నం డబ్బు కోసమై బిచ్చగాడయ్యాడు. ఎలా నైతేనేమి తన ఎముకలు పిండి బిడ్డలను గొప్ప ఇళ్ళకు పంపానని సంతృప్తి మాత్రం ఆయనకు మిగిలింది. ఇంకా ఇద్దరు కూతు ళ్ళున్నారు. అటువంటప్పుడు ఆయనను 'భర్త వ్యాపారం చేస్తారు డబ్బు కావాలి' అని అడగడం అవివేక మనిపించింది. ఆ విషయమే ఆయనతో చెప్పింది. దాని మీద చాలా గొడవ జరిగింది. ఆఖరకు తెగేసి చెప్పింది "వాళ్ళింటి నుండి ఏనాడు విడిపోయి వచ్చానో అంతే ఇక నేను వాళ్ళకు పరాయిదాన్ని. పరాయివాళ్ళ సొమ్ము అడగ డానికి నా సంస్కారం ఒప్పుకోదు". దానితో ఆయనకు కోపం వచ్చి "ఆ పరాయి ఇంటి గడప త్రొక్కడానికి వీలులేద'ని శాసించారు. తను వూరుకుంది కాని పుట్టింటి నుండి ఉత్తరాల మీద ఉత్తరాలు రాసాగాయి పండక్కు రమ్మని. అసలే కోపం జాస్తి. అందులో విసిగిపోయున్న తను ముందూ వెనకా ఆలోచించకుండా తల్లికి ఉత్తరం వ్రాసింది. ఇంకెప్పుడూ తన గురించి తలచవద్దని, వాళ్ళ గడప త్రొక్కడం లేదనీ. దానితో ఉత్తరాలు కూడా ఆగి పోయాయి. ఆఖరకు తన ఆశయాల కనుకూలంగా తన బిడ్డలను పెంచాలను కుంది. కాని ఆ ఆశ కూడా లేకుండా పోయింది. "ప్రక్కింటివాళ్ళతో తగు వేసు కోవద్దని కొడుకును కొట్టబోతుంటె ఆయన వచ్చి "వాడి మీద చెయ్యి ఎత్తావో నీ వీపు పగులుతుంది" అన్నారు. నిర్ఘాంత పోయింది తను "భర్త భార్యను కొట్టడమా?" ఎంత చులకన కొడుకు ముందు! ఇకవాడిని తనేం బాగు చేయగలదు! వాడి

నిమిరినా అనటోతే 'నాన్నకు చెప్తాను' అని బెదిరించేవాడు. వాడితోనూ, భర్తతోనూ, విసిగిపోయి వూరుకుంది.

* * *

"జగతీ!"

మధురస్మృతుల తలపులలో ఆమె పెదవుల మీద మెరిసిన హాసరేఖ మాయమైంది.

ఎదురుగా నిల్చుని చిరునవ్వుతో తన కళ్ళలోకి సూటిగా చూస్తున్న భర్తకు ఈ విషయాన్ని ఎలా తెల్పడమా అని తటపటాయించింది. చెప్పడమంత కష్టమని కాదు. కాని తనింత మధురంగా ఊహించుకున్న దానిని, క్షణక్షణమే ఎదురు చూస్తున్న దాని అతను కొట్టిపడేస్తే.. కాదంటే?..

అతని చిరునవ్వుతో ధైర్యాన్ని కూడ గట్టుకుని అంది.

"మీకో విషయం చెప్పనా?"

"ఏ విషయం?.. వుండువుండు. నీ విషయం వినేముందు నేను నీకొకటి చూపెడ్తాను."

"ముందు నేను చెప్పేది వినండి మరీ.." చిన్నవాడు మరచిపోయిన అల్లరిని గుర్తుకు తెచ్చుకోవడానికి బలవంతాన ప్రయత్నించింది జగదీశ్వరి.

"ఊహూ నేను ముందు" అతనింకా నవ్వుతూ నవ్వుతున్నాడు.

'అప్పనవును. మీరు భర్త కదూ. మీరే ముందు" నిండుగా నవ్వుతూ అన్నది.

"అహా ఎప్పటినుండటా ఈ పతివ్రతాత్వం" వెటకారంగా నవ్వి ముడుచుకు పోయిన భార్య ముఖాన్ని చేతుల్లోకి తీసుకుంటూ,

"నీకు చీర తెచ్చాను" అన్నాడు. ఆమె మాట్లాడలేదు.

"నీ చీరలన్నీ చిరిగిపోయాయి కదూ!" ఆమెను ఆప్యాయంగా గుండెల కత్తుకుంటూ అన్నాడు మెల్లిగా

ఆమెకు ఆ ఆలింగనంలో హాయిగాని, అతని ఆప్యాయతకు సంతృప్తిగాని కలగ లేదు. అతని వెటకారంలో క్రొత్త చీర ఆనందం కలగలేదామెకు.

"ఏం బాగులేదా? ఆముదం త్రాగినట్లు పెట్టావు ముఖం". బలవంతాన నవ్వుతూ అంది జగదీశ్వరి "చాలా బాగుంది. రంగు, అంచు, నేత అన్నీ బాగున్నాయి. ఎంతయ్యిందేమిటి?"

"నీకు అన్నీ నవ్వాలనే కొద్దిగా ఎక్కువ

ఖరీదయిపో కొన్నాను” అమె మాట్లాడ లేదు. అతను లేచి వెళ్ళిపోతున్నాడు గొంతు సవరించుకుని చెప్పింది “ఈరోజు రమేష్ వస్తున్నాడు.”

వెనక్కి తిరగకుండానే అన్నాడు “ఎవరు?”

“రమేష్”

“ఉహూ” అని వెళ్ళిపోతున్న భర్తవైపు నిరాశగా చూచింది జగదీశ్వరి. పోనీ 'రావడానికి లేద'ని ఖచ్చితంగా చెప్పలేదు నయమే. అనుకుని సంతృప్తి పడింది.

భోజనం చేస్తూ తలెత్తి, వడ్డిస్తున్న భార్య నుద్దేశించి అడిగాడు.

“ఎవరా రమేష్?”

“మా అక్కయ్య కొడుకు.”

“ఓహో! అలాగా? మీ కాలేజీలో స్నేహితుడేమో అనుకున్నాను.. అతని కళ్ళల్లో అనుమానానికి వణికిపోయిందామె.

“భగవాన్! వాడు నాకొడుకు. నామొదటి బిడ్డ.” నిట్టూర్చింది. నిశ్శబ్దంగా.

* * *

సంధ్య గూటికి చేరుకుంటోంది. ప్రకృతి కాంత ఆలింగనంలోని నలుపు తెలుపుల సమన్వయం వింతగా వుంది. పడమట దిక్కున ఆకాశంలో మారుతున్న రంగులు అద్భుతంగా వున్నాయి. ఎర్రటి కాంతిలో పచ్చటి చెట్లు పరమసుందరంగా కన్పిస్తున్నాయి.

గమ్యం దగ్గర పడుతున్న కొద్దీ రమేష్ గుండె వేగంగా స్పందించడం ప్రారంభించింది.

ఎలా పిన్నిని ఎదుర్కోవడం? ఎప్పుడో చూచిన పిన్ని ఇప్పుడెలా వుంటుంది? అమ్మలాగ పెద్దగా, నిండుగా కళకళలాడుతూ, ఇల్లంతా బొంగరంలా తిరుగుతుంటుంది కాబోలు. ఎంతైనా యజమానురాలు. ప్రతి పనికీ ఆంక్షలు పెట్టడానికి అమ్మమ్మ లేదక్కడ. తన పిల్లలని తనిష్టమొచ్చినట్లు కొట్టుకోవచ్చు...” ఊహాల నుండి బయట పడి మనసులోనే నవ్వుకున్నాడు రమేష్.

పగలంతా సాధించి చదువు చెప్పేటప్పుడు పిన్నంటే కోపమొచ్చినా, రాత్రి ప్రక్కన పడుకుని అమె తనను హృదయాని కత్తుకుంటే హాయిగా వున్నట్టనిపించేది. పగలంతా 'కొట్టే పిన్ని'లా అన్పించేది వాకు.

పసివయసులో దెబ్బలు మాత్రమే రుచిచూచిన తను వయసు పెరిగే కొలదీ అమెలో అనురాగాన్ని కూడా చూడగలిగాడు. అమ్మమ్మ వాళ్ళింట్లో పిన్ని తప్ప తననెవరూ తాకేవారు కాదు. పిన్ని కొట్టినా మిగతా వాళ్ళందరూ తనను రక్షించేవారు. కాని వాళ్ళెవరూ తనను పిన్నిలా ప్రేమించ లేదు.

ఇంత కాలానికి ఆ విషయం తలచుకున్న ప్పుడుకూడా అతని కళ్ళు ఆర్ద్రమయ్యాయి. అంతగా ప్రేమించిన పిన్నికి తనే మివ్వగలిగాడు? బంధాలన్నీ తెంచుకుని అమ్మతో పారిపోయాడొకరోజు.

ఇన్ని ఏళ్ళు, పిన్ని జ్ఞాపకాలలో పెరిగి ఈనాడు ధైర్యంచేసి అమె నెదుర్కోబోతున్నాడు. తలచుకుంటే విచిత్రంగానే

తుంటుంది. "ఇన్ని సంవత్సరాలు ఇలా వుండగలిగాడు పిన్నిని చూడకుండా!"

* * *

"పిన్నీ!"

"క..న్నా..!"

అంత దూరాన నిలబడి విచిత్రంగా, ఆనందంగా మిలమిల మెరిసే కళ్లతో అనురాగమంతా అందులో నింపుకుని కన్నార్పకుండా చూస్తోంది ఆమె. "ఎంత వాడయ్యాడు! ఇంకా చిన్ననాటి చిలిపివాడినే, ఊహించుకుంది తను. ఇంత గంభీరంగా, ఇంత పొడవున ఎప్పుడెదిగిపోయాడు! తను చిన్ననాటి స్మృతుల నన్నింటినీ ఎప్పుడు దొంగిలించుకున్నాడు? పది సంవత్సరాల పసికందు ఇంతలో పాతిక సంవత్సరాల యువకుడుగా నిల్చుని "పిన్నీ" అని పిలిస్తే ఎలా భరించడం? భగవాన్! అతిమధురమైన వాడి బాల్యాన్ని అప్పుడే ఎందుకు లాక్కున్నావ్?" ఆమె కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి.

"పిన్నీ!"

"కన్నా!" మితిలేని మమతతో గబగబ వచ్చి రమేష్‌ను గట్టిగా గుండెల కదుముకుంది.

"ఎంతలా మారిపోయావురా?"

"పదిహేను సంవత్సరాలయింది పిన్నీ నువ్వు నన్ను చూచి" నవ్వడానికి ప్రయత్నించాడు రమేష్.

"అవును.. నాకు తెలుసు.. ఎలా వున్నావురా ఇన్నిరోజులు పిన్నిని చూడకుండా" ఆమె గొణిగింది.

ఆమె గుండెల మీద వాలి ఆలోచిస్తున్నాడతను.

"సన్నగా, తీగలా, చలాకీగా వుండే పిన్ని

# పిన్ని

పూర్తిగాపోయింది. ఆమె కంఠంలో ఎప్పటిలా శాసనంలేదు. కాని ఎప్పటి ఆప్యాయత వుంది. ఆమెకళ్లల్లో అధికారయుతమైన అనురాగం కాదు అసహాయతతో కూడిన అనురాగం వుంది. కానీ..కానీ.. ఇన్ని సంవత్సరాలకు మరలా అదే గొంతు 'కన్నా' అని అదే పిలుపు. భగవాన్! దీని నుండి ఎప్పటికీ నన్ను దూరం చేయకు."

కొడుకును తన గుండెల మీద నుండి లేపి కళ్లు తుడుచుకుంది. ఆమె పెదాలు నవ్వుతున్నాయి.

"బాగున్నావురా?"

"ఏం బాగలేవా పిన్నీ"

"అల్లరి మాత్రం పోలేదు" సన్నగా నవ్వింది.

"నువ్వు నన్ను ప్రేమించడం మానేంత వరకు నేను అల్లరి చేయడం మానను పిన్నీ" ఆ మాటను పైకి అనలేకపోయాడు. ఆమె ఆ మాటలు విన్పించుకోలేదు.

"అమ్మ బాగుందా కన్నా"

"బాగుంది. నీతో పోటీకి లావెక్కుతూ." నవ్వాడు.

"అమ్మమ్మ నీమధ్య చూసావురా" ఆమె కంఠంలో కన్నీళ్లు కదలాడాయి.

"లేదు పిన్నీ! నేరుగా నీ దగ్గరకే వస్తున్నాను."

"పెద్దతనంలో ఎలా వుందో ఏమో! చిన్నప్పుడు ఆమె చాదస్తంగా మాట్లాడి విసిగిస్తుంటుందని ఆమెకు దూరంగా వేరుగా రూములో కెళ్లి పడుకునే దాన్ని. ఈనాడు చూడాలన్నా వీలుపడదు', దుఃఖంలో గొంతు పూడుకుపోయింది.

"ఒక్కమారు అమ్మమ్మను చూడాలని వుందిరా" ఆమె కళ్ల నుండి టపటప రాలాయి కన్నీళ్లు. కన్నార్పకుండా పిన్ని వైపు చూస్తున్నాడతను.

'ఎలా పిన్ని కన్నీళ్లు తుడవడం?'

"తాతయ్య ఆరోగ్యం బాగుందా" తనను తాను సంబాళించుకుంటూ అడిగింది.

"ఫరవాలేదు పిన్నీ బాగానే వుంది."

"నాగురించి ఎప్పుడైనా అనుకుంటారా?" అతికష్టం మీద మెల్లిగా అడిగింది.

"ఎందుకనుకోరు పిన్నీ. నువ్వు పుట్టింటికి రాకపోతే మాత్రం వాళ్లకు నువ్వు కూతురువేగా?"

"కాదురా నువ్వు అబద్ధం చెప్తున్నావు. నేను నాభర్తను పుట్టింటికి పంపమని ప్రాధేయ పడలేదని వాళ్లకు కోపం..నాకు తెలుసు. వాళ్ల అభిప్రాయం నాకు అహంకారం యెక్కువని, వాళ్ల నెవరినీ చూడక పోయినా నేనుండగలననీ.."

"పిన్నీ!"

"నీకు తెలియదురా. అదంతే.. అవును నిజమే నాకు అహంకార ముంది. కాని వాళ్లకు తెలియంది ఇంకొకటుంది. ఆ అహంకారపు పరదా వెనక నేనెంతగా క్షణ క్షణమూ కుమిలిపోతున్నానో వాళ్లర్థం చేసుకోలేరు. అందుకు వాళ్లు ప్రయత్నించను కూడా ప్రయత్నించరు."

....................

"...పోనీ నాకు వాళ్లక్కరలేదు. వాళ్ల బిడ్డలలో నేను ఒకతెనుకానూ? బిడ్డ తప్పు చేస్తే క్షమించకపోతే పోనీ శిక్షించడం ఈవిధంగా మాత్రం కాదు.. నేనంటూ ఒక కూతురు నున్నానని వాళ్లు మరచిపోయారురా" ఆమె వెక్కివెక్కి ఏడుస్తోంది. విధిచేత మమకారాల నుండి వంచించబడ్డ తన జీవితాన్ని తలచుకుని కుమిలి కుమిలి ఏడుస్తోంది.

"పిన్నీ! నువ్వు తప్పుగా అర్థం చేసుకున్నావు పిన్నీ. అమ్మమ్మ వాళ్లు చాలామార్లు అల్లుడికి కబురంపించారు. జవాబు లేకపోతే వాళ్లే రావాలనుకున్నారు కానీ నిన్ను కష్టపెట్టడం ఇష్టంలేక ఊరుకున్నారు. నాకు బాగా గుర్తుంది ఆరోజుల్లో అమ్మమ్మ ప్రతిరోజూ ఏడ్చేది" పిన్ని కన్నీళ్లను తుడుస్తూ చెప్పాడు. కొద్దిసేపటికి తేరుకుంది ఆమె.







Blue Seal
TALC

# పిన్ని

"ఇదేమిటి.. పసివాడి ముందు.. ఏమిటో ఏన్నాళ్ళకో నిన్ను చూడగానే.. నీ పిన్నికి మతిపోతుందనుకుంటున్నావు కదూ!" అని నవ్వి రమేష్ చెయ్యి పట్టుకుని గదిలోకి తీసుకెళ్ళి మంచం మీద కూర్చోపెట్టింది.

"దూరప్రయాణం. చూడు ఎలా నలిగి పోయావో! వుండు స్నానానికి నీళ్ళు తోడి వస్తాను. ఇక్కడే కూర్చో."

కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళే పిన్ని వైపు విచిత్రంగా చూచాడు. 'ఎప్పుడూ గంతు లేసే పిన్ని నడకేనా అది! ఏడ్చే పిన్ని క్రొత్తగా అన్పిస్తోంది అతనికి. పసివాడుగా తనెప్పుడూ పిన్ని ఏడవగా చూడలేదు. అమ్మమ్మ మీద, తన మీద అధికారం చలాయించే పిన్నే తనకు గుర్తు. తనను ప్రేమించేది నిజమే కాని ఇలా ఎప్పుడూ తన ప్రేమను పైకి వ్యక్తపరచలేదు. రాత్రి తను నిద్రపోయా డనుకుని గుండెల కత్తుకుని "నా కన్నా!" అనుకునే పిన్నే తనకు తెలుసు.'

"రా. స్నానం చేద్దువుగాని" పిండుగా నవ్వుతోందామె. తొట్టె దగ్గర అతను స్నానం చేస్తుంటే కొద్దిదూరంలో పీట వాల్చుకుని కూర్చుంది.

"నీ కాలేజి చదువు ఎక్కడ హైదరాబాదులోనేనా?"

"అవును"

"చెల్లెలేం చేస్తోంది."

"పెళ్ళి చేసుకోబోతోంది" నవ్వాడు రమేష్.

"అప్పుడే పెళ్ళేంటి పసిపిల్ల"

"పసిపిల్లేంటి పిన్ని ఇరవై సంవత్సరాలు వస్తేనూ"

"అప్పుడే" మనసులోనే గొణుక్కుని "తమ్ముడేం చేస్తున్నాడు?" అంది.

"బి. ఏ. ఫెయిలవుతున్నాడు"

"నవ్వులాటకాదు. నిజం చెప్పరా. నాకు మీ అందరి గురించి తెలుసుకోవాలని వుండదా?..."

"అదేంటి పిన్నీ! నిజం. వాడికి చదువు రావడంలేదు అదే అమ్మ బెంగ"

"నేను నమ్మను నీ తమ్ముడికి చదువు రాకపోవడమేంటి?"

"వాడు నాకు తమ్ముడేగాని, నీ కొడుకుగా మాత్రం పెరగలేదు పిన్నీ" చేతిలోకి సబ్బు నురుగు తీసుకుంటూ అన్నాడు.

"నీ చేత ఒక దెబ్బతినందే ఎవ్వరికి మాత్రం చదువెలా వస్తుంది" సంతోషానికి, దుఃఖానికి మధ్యస్థంగా కొట్టుకులాడుతున్న పిన్నిని నవ్వించాలనే ఉద్దేశంతోనే రమేష్ ఆమాటన్నా, ఆమెకు అది చాలా బలంగా గుచ్చుకుంది.

"పాపిష్టిదాన్ని ఎలా కొట్టగలిగేదాన్నో! కొట్టికొట్టి దూరం చేసుకున్నాను నేను" గొణుక్కుంది ఆమె.

"భలే దానివి పిన్నీ. అలా బాధ పడ్తావేం? నువ్వు కొడ్తే మాత్రం నాకు తెలియదూ నువ్వు నన్నెంతగా ప్రేమించే దానివో" అని స్వరం తగ్గించి "నిజం పిన్నీ, నీ పునాది లేకపోతే నేనెక్కడో మధ్యలో కూలిపోయేవాడినే. నా చెంపల మీద ఎర్రటి నీ వేళ్ళ గుర్తులే నన్నింత వాణ్ని చేసాయి" అన్నాడు.

"చాలురా. చాలు. నన్నింకా అదృష్టవంతురాలిని చేయకు" ఆమె కళ్ళు మెరుస్తున్నాయి. పెద్ద ఉద్యోగస్థుడైన అనాటి తన కొడుకును తదేకంగా చూస్తోంది. చిన్న రమేషుడికి స్వయంగా తను స్నానం చేయిస్తున్నట్టు, వాడు అల్లరి చేస్తున్నట్టు అనుభూతినందుతోంది ఆమె.

"పిన్నీ!" స్నానంపూర్తి చేసి తుండుతో తుడుచుకుంటూ పిలిచాడు.

"ఏరా" ఉలిక్కిపడింది ఆమె.

"బాబా యెక్కడ పిన్నీ!"

"పొలం నుండి రాలేదు. నీకు పీట వేస్తాను. భోంచేద్దువుగానిరా"

"ఇప్పుడే ఆకలిగాలేదు. అందరం కలిసి తిందాంలే పిన్నీ"

"సరేలే. వేషాలు వేయకు. నాకు తెలియదా ఏమిటి నీ ఆకలి విషయం?"

"అవును. నా గురించి నీకు ఏమి తెలియదు గనుక!" మనసులోనే అనుకుని పైకి మాత్రం నవ్వుతూ,

"అచ్చు చిన్నప్పటి పిన్నిలా మాట్లాడావు పిన్నీ!" అన్నాడు.

"అవునురా... చిన్నప్పటి పిన్ని.." అని ఏదో చెప్పబోయి ఆగి,

"తొందరగా రా" అంటూ వంటింట్లో కెళ్ళిపోయింది. ఎదురుగా కూర్చుని కొసరి కొసరి పెడ్తున్న పిన్ని వైపు తినడం మాని తదేకంగా చూస్తున్నాడు రమేష్.

"నా ముఖాన్నేం చూస్తావు. నీ కిష్టమని బీరకాయ పప్పుకూర చేసాను తినరా."

అతని కళ్ళు చెమ్మగిల్లాయి.

"పిన్నీ! నీ దగ్గర నుండి నన్ను తీసుకెళ్ళి కాన్వెంటులో చేర్చాక ప్రతి పని నేనే చేసుకోవాల్సి వచ్చేది. అటువంటప్పుడు నువ్వు గుర్తుకొచ్చి ఏడ్చుకునేవాడిని. అదేమిటో నాకు అమ్మగాని, అమ్మమ్మగాని గుర్తు వచ్చేవారు కాదు."

ఆమె మాట్లాడలేదు. ఆమె కంట్లో నుండి ముత్యాల కంటె అందమైన రెండు నీటిబొట్లు మెరిశాయి.

ఆరుబయట మంచం మీద కూర్చుని చుట్టూ చూసాడు రమేష్. అప్పుడే ఉదయించిన అర్ధచంద్రుని కాంతిలో దొడ్లో చెట్లు మసక మసగ్గా కన్పిస్తున్నాయి. వాటి నీడలు గోడ మీద అటూ ఇటూ కదలుతున్నాయి. మల్లెపందిరి విరగబూసినట్టుంది. గుబాళిస్తోంది వాసన. చాలా సేపటి నుండి అతనిని ఒక ప్రశ్న వేధిస్తోంది. తను విన్నంత వరకు పిన్నికి ఇద్దరు పిల్లలు. కాని ఇంత చీకటి పడినా వాళ్ళు కన్పించరేం! అయితే తను విన్నది అబద్ధమా?

"పిన్నీ! నాకు తమ్ముళ్ళు, చెల్లెళ్ళు లేరా?"

అంతవరకు నవ్వుతున్న ఆమె ముఖం మలినమయింది.

"ఎంత దవుర్భాగ్యం! నీ తమ్ముళ్ళను గురించి తెలుసుకునే అవకాశమే నీకు లేకపోయింది" నిట్టూర్చింది.

"నీకు ఒకతమ్ముడు, ఇద్దరు చెల్లెళ్ళు. పెద్దవాడు రాజా. రెండవది కమల. మూడవది భారతి. రాజా ఐదవ తరగతి, కమల మూడు, భారతి నింకా చదవేయలేదు."

"ఎక్కడికి కెళ్ళారు వాళ్ళంతా?"

"రాజా వాళ్ళ నాన్నతో పొలం వెళ్ళినట్టున్నాడు. కమల భారతిని ప్రక్కింటికి తీసుకెళ్ళినట్టుంది."

చిన్నప్పుడు తనను ఎక్కడికీ పంపేది కాదు ఒంటరిగా. ఒకరోజు స్నేహితులతో ఆడుకుంటూ పిన్ని విషయం మర్చిపోయి దీపాలు పెట్టే వేళకు ఇంటికి వచ్చాడు. వాకిట్లో పిన్ని ఎదురు చూస్తోంది. కొడ్తుందని భయపడ్డాడు. కాని కొట్టలేదు గబుక్కున ఎత్తుకుని ముద్దు పెట్టుకుంది. అప్పుడు ఆమె కళ్ళల్లో జాలిపడిన వెన్నెల రేఖను స్పష్టంగా చూచాడు. అటువంటిది కరెంటన్నా లేని ఈ వూరులో కొడుకు పొలం నుండి ఇంత ప్రొద్దుపోయినా రాకపోతే

ఇంత నిర్వికారంగా ఎలా వుండ గలుగు తోంది? మాట మళ్లించి—

"పిన్నీ! ఇప్పుడు కథలు వ్రాయడం లేదా?"

ఆమె అదోలా నవ్వి 'లేదు' అంది.

ఇంతలో రాజా పుంజును చంకనేసుకుని దూసుకుంటూ వచ్చాడు. పుంజును ముద్దు పెట్టుకుని వదిలి "అమ్మా! మన పుంజా..." అని ఏదో చెప్పబోతూ ప్రక్కనున్న వ్యక్తిని చూచి, ఆగాడు.

"నువ్వేనా రమేషన్నయ్య వంటె. అమ్మ నన్ను స్టేషను కెళ్లమంది కాని, ఏంచేయను, ఈరోజే కోడి పందాలు పెట్టుకున్నా మాయె. నీకు తెలియదు కాని ఓహ్ మాకోడి వుంది చూసావ్ ఒక్కగెంతు గెంతిందంటె ఫస్.." పెదవి విరచి ఇంకా చెప్తున్న రాజును

# పిన్ని

వింతగా చూస్తున్నాడు రమేష్.

"అది సరే! పట్నం నుండి వచ్చావు కదా! నాకేం తెచ్చావు" తన ధోరణిని మధ్యలోనే ఆపి అడిగాడు. అప్పటికి తేరుకుని సూట్‌కేస్ తీసి వాడి కొరకని తెచ్చిన 'ఆల్బమ్' తీసి వాడి చేతికిచ్చాడు. వాడు దానిని అటూ ఇటూ త్రిప్పి "దీనిసేం చేసుకోనూ?", అన్నాడు అయిష్టంగా. అందుకు రమేష్ చిరునవ్వు నవ్వి "దీంట్లో ఫోటోలు అంటించుకుంటారు" అని చెప్పాడు. ఏదో పిచ్చి వాడి మాటలు విన్నట్టు రమేష్ వైపు చూచి పకపక నవ్వి "ఎక్కడో వెర్రిబాగుల వాడిలా వున్నావే. ఇందులో ఫోటోలంటించు కోవడమేమిటి? గోడకు తగిలించుకోవాలి కాని." అని ఆగ "అయినా పర్వాలేదులే ఇది స్టాంపులు అంటించుకోవడానికి పనికి వస్తుంది" అని దానిని పట్టుకుని తుర్రు మన్నాడు.

వాడు వెళ్లిన వైపే నమ్మలేనట్టు చూస్తూ వుండిపోయాడు రమేష్. తనను తీర్చిదిద్ది పెంచిన పిన్ని కొడుకును అలా వూహించుకోలేదు రమేష్. వాడు అలా మాట్లాడుతున్నప్పుడైనా ఆమె కసురు కుంటుందనుకున్నాడు. కాని ఆమె అంత సేపూ మౌనంగా ఎటో చూస్తూ కూర్చోవడం అతనికి ఆశ్చర్యాన్నే కలిగించింది. మెల్లిగా పిన్ని వైపు తిరిగి అడిగాడు.

"పిన్నీ! నీకు కెమెరా వుండేది కదూ! ఏం చేసావు?"

ఆమె నిర్లిప్తంగా జవాబు చెప్పింది, "అమ్మేసాను మావారు దాని కారణం."

పొలం నుండి వచ్చి తన భార్యతో ఎవరో మాట్లాడుతుండడం చూచి ఆగిపోయా డతను "వీడే రమేష్" భర్తకు పరిచయం చేసింది. "అహ ఎప్పుడు వచ్చారు? అంతా బాగున్నారా?" అన్నాడు అతను నవ్వుతూ. బాగున్నామన్నట్టు నవ్వి తలఎత్తి పరిశీలనగా చూచాడు అతని వైపు రమేష్.

"ఎంత భారీ విగ్రహమతనిది! ఏమి సుందర రూపం!!" అతని పెదాలపై తారాడే చిరునవ్వును చూస్తూ అనుకున్నాడు రమేష్.

"ఇతనిని భర్తగా పొందగలిగిన పిన్ని ఎందుకు సుఖపడలేకపోతోంది?"

"పరీక్షలయిపోయాయా? ఇప్పుడు సెల వలా?"

"అవునండీ" ఆ అపరిచిత వ్యక్తిని ఎంత ప్రయత్నించినా 'బాబాయ్!' అని పిలవలేక పోయాడు. అందుకు పిన్ని ముందు తల వంచుకున్నాడు రమేష్.

తన భర్త రమేష్‌తో అంత మర్యాదగా, అంత చనువుగా మాట్లాడుతుంటే సంతో షంతో ఉక్కిరిబిక్కిరయింది జగదీశ్వరి.

* * *

"జగతీ!"

రాత్రి పదిగంటల వేళ నడవలో మంచం మీద కూర్చుని కన్నాతో కబుర్లు చెప్తున్న జగదీశ్వరి ఉలిక్కిపడింది భర్త కేకవేస్తే పిలుపుకు.

"కన్నా! ఇప్పుడే వస్తాను" అని తొందర తొందరగా భర్త గదిలోకి నడచింది జాజి పూసల కర్జూను తొలిగించుకుని.

"అసలు నీకు మొగుడనే వాడొక డున్నాడని జ్ఞాపకముందా?" భర్త గద్దింపుకు మౌనంగా తలవంచుకుని నిల్చుంది ఆమె.

"వాడు వచ్చిన దగ్గర నుండి చూస్తున్నాను నీ తరహా. నా అతీగతీ కనుక్కునే దిక్కులేకపోతోంది ఈ ఇంట్లో."

"క్షమించండి. నాలుగురోజులు వుండి పోయేవాడు..."

ఆమె మాటపూర్తిచేసే లోపలే గట్టిగా అరిచాడు.

"అడ్డమైన వాళ్ళందరిని పోషించడానికి నా దగ్గరేం రాసులు పోసిలేవు."

ఇక మౌనంగా వుండలేకపోయింది జగదీశ్వరి.

"వాడేం మనకులా గతిలేని వాడేంకాదు. వాడి పిడికెడు మెతుకులుకేగాక మనింటిల్లిపాదినీ పోషించగలడు కావాలంటె."

"మీ పుట్టింటి సొమ్ము కోరుకోవడానికి నేనేం సిగ్గులేనివాడినికాదు. కావాలంటే వాడితోనే నువ్వూ ఊరేగు నాకేం అభ్యంతరం లేదు."

"ఎందుకు అంతంత మాటలంటారు. నేను..." ఆమె కంఠంపూడిపోయింది.

భార్య కన్నీళ్లతో అతని కోపం చల్లారింది. ఆమెను దగ్గరకు తీసుకుని బుజ్జగిస్తూ అన్నాడు.

"అలా ఏడవకు. నువ్వు అతనితోనే ఇరవైనాలుగు గంటలూ వుంటూ నన్ను నిర్లక్ష్యం చేస్తే ఎలా? అతను నీ కొడుకు కాని మరెవరన్నాకానీ, నువ్వు నాకు తప్ప ఇంకెవరికీ ఏమీ కాకూడదని చెప్తున్నాను కదా! ఎందుకు నన్ను అర్థం చేసుకోవు?"

ఆమె అతనికి దూరంగా జరిగి కన్నీళ్లు తుడుచుకుని అతని కళ్లల్లోకి సూటిగా చూస్తూ అంది,

"అవును. మిమ్మల్ని నేనర్థం చేసుకుంటాను. కాని నన్నెవరు అర్థం చేసుకుంటారు? మీరు..మీరు.. నన్నేనాడైనా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించారా? బలంగా నా వ్యక్తిత్వాన్ని దెబ్బ తియ్యాలని చూచారేగాని, సున్నితంగా ఏ రోజైనా ప్రవర్తించారా?"

అతని జవాబుకైనా ఎదురు చూడకుండా గబగబ గది దాటి ముఖం కడుక్కుని కొడుకు దగ్గర కెళ్లి "అలస్యమయింది కన్నా ఇక పడుకో" అని ప్రక్కనే ఇంకొక మంచం మీద వాలుకుని కళ్లు మూసుకుంది.

ప్రొద్దున్నే లేచి బెడ్డింగ్ కడుతున్న కొడుకును విచిత్రంగా చూచి,

"ఎందుకు కన్నా! సామాను సర్దుతున్నావ్" అంది జగదీశ్వరి.

"నేను వచ్చి అప్పుడే నాలుగురోజులయింది పిన్నీ. అమ్మ నా కొరకు ఎదురు చూస్తుంటుంది."

"కన్నా!" ఆమె గొంతులో విషాదానికి చకితుడై కడుతున్న బెడ్డింగ్ ఆపి కళ్లెత్తాడు రమేష్.

"కన్నా! నీ పిన్ని దగ్గర ఇక వుండాలని లేదురా..నేను మాత్రం నీకు అమ్మను కానా?... మీ అమ్మకాదు నేను.. నేనురా నీ కొరకు పదిహేను సంవత్సరాలుగా ఎదురు చూస్తున్నది."

కళ్లు తుడుచుకుంటూ వెళ్లిపోతున్న పిన్ని చెయ్యి పట్టుకుని ఆపి "అదికాదు పిన్నీ" అన్నాడు అస్పష్టంగా నీళ్లు నిండిన కళ్లతో నిశ్శబ్దంగా కొడుకు వైపు చూచిందామె.

"నీ దగ్గర ఎన్నిరోజులయినా వుండగలను పిన్నీ. కానీ.. కానీ రాత్రి.."

ఆమె ముఖం కాంతి విహీనమయింది. ఒక్కక్షణమయ్యాక గొణిగింది.

"నువ్వు విన్నావా?"

"విన్నాను పిన్నీ అంతా విన్నాను."

అవమాన భారంతో ఆమె తల వంగిపోయింది. ఆ స్థితిలో పిన్నిని చూడగానే రమేష్ గుండెను ఎవరో పిండుతున్నట్లనిపించింది. చటుక్కున లేచి పిన్ని కెదురుగా నిల్చుని ఆవేశంతో చెప్పసాగాడు.

"ఏమీ తెలియని పసితనంలో నీనుండి పారిపోయాను. కానీ పిన్నీ! నీ జ్ఞాపకాలనుండి నాకు విముక్తి మాత్రం లభించలేదు. నేను దానిని కోరలేదు కూడాను. అమ్మతో వెళ్లిపోయాక కూడా నీ దగ్గరకు పరుగెత్తుకొచ్చేయాలని ఆరాటం.. తెలిసీ తెలియని వయస్సులో నాకెవరో చెప్పారు. 'ఇక పిన్ని నిన్ను చూడడానికి రాదని'. ఎందుకో వెక్కివెక్కి ఏడ్చా నారోజు. 'పిన్నిని చూడాలని వుంది' అన్నప్పుడు అమ్మ మొదట కంట తడి పెట్టింది. పిన్ని కావాలని ఏడిస్తే కోప్పడింది. కొద్దిగా పెద్దవాడినయ్యాక కష్టసుఖాలన్నీ విడమర్చి చెప్పింది ఒకరోజు. ఆరోజు నుండి ఈరోజు వరకూ మారుమూల నున్న నీ గురించి తెలుసుకోవడానికే ప్రయత్నించాను. కాని తెలియందే ఎక్కువ వుండిపోయింది..." చెప్పడం ఆపి నిట్టూర్చాడు.

"ఎంత హాయిగా, ఎంత కీర్తితో జీవిస్తూ వుంటావో అనుకున్నాను నీ గురించి! అంత ఎత్తులో అపురూపంగా నిల్పెట్టి ప్రతిక్షణమూ నిన్ను గురించి ఏవేవో తలచుకునేవాడిని..నీగురించి నీ సంసారం గురించి ఎంతో ఉన్నతంగా నాకంటి ముందు మేడలు కట్టుకునేవాడిని. నా పసిహృదయంలో అంతగా[illegible]ంగా అల్లుకుపోయ్యావు నువ్వు.. నా పూహాలన్నింటిలోను

నువ్వే.. మహారాణిలా యాజమాన్యం చేసే పిన్నీ..."

"ఆ వూహతోనే బ్రతకాల్సింది నేను. ఎందుకొచ్చా నిక్కడికి. తర్వాత ఈస్థితిలో నిన్నెలావూహించుకోవడం? ఎంతో హుందాగా చిత్రించుకున్న పిన్ని ఇంత అసహాయురాలని తెలిసి ఎలా ఓర్చుకోవడం? అన్నీ పోగొట్టుకున్న నీ గురించి అందరూ కథలు కథలుగా చెప్పినప్పుడు నేననుకున్నాను నువ్వేమీ పోగొట్టుకోలేదని. నీ ఆత్మవిశ్వాసం నీ కుందనీ..నీ అహంకారాన్ని నువ్వు వదులుకోనందుకు సంతోషపడ్డాను. భోగభాగ్యా లనుభవించకపోయినా నీ ఇంట్లో నీ కధికారం వుంటుందనుకున్నాను. మరొక్కమారు దానికి తలొగ్గడానికి సంతోషంతో ఇంత దూరం పరుగుపరుగున వస్తే..నేను చూచిందేమిటి?"

"పదిమందికి రెండుచేతులా బట్టలు దానం చేసిన నువ్వు ఈనాడు రెండు చీరలతో కాలం వెళ్ళబుచ్చుతున్నావంటే నేనందుకు సిగ్గుపడడం కాని బాధపడడంకాని లేదు. కానీ పిన్నీ..నీ వ్యక్తిత్వం, ఆశయాలు, ఆదర్శాలు ఏమైపోయాయి. నీ ఆత్మాభిమానం దెబ్బతింటుంటే కూడా ఎలా సహించగలుగుతున్నావ్.. ఎలా ఓర్చుకుంటున్నావ్ పిన్నీ. ఆజ్ఞాపించడమే తెలుసుగాని ఆజ్ఞాపించబడడం తెలియని నిన్ను ఈ స్థితిలో చూడడానికి నా గుండె ఎలా గిలగిలలాడుతుందో నీకెలా చెప్పను...ఇంకా నన్ను ఇవన్నీ చూస్తూ వుండమంటావా, పిన్నీ.." ఆయాసంతో ఆగాడు.

అంతవరకు మౌనంగా వింటున్న జగదీశ్వరి అతనిని గట్టిగా గుండెల కదుముకుంది. అతని కళ్ళల్లో నుండి రెండు కన్నీటి చుక్కలు ఆమె భుజం మీదపడి ఇంకి, పోయాయి.

"చాలురా. ఇంత కంటె ఇంకేదో కావాలనుకోవడ మెందుకు? తల్లి మీద పౌను భూతి చూపించే కొడుకువు నువ్వున్నావు..." ఆతర్వాత అతని తల నిమరడం తప్ప ఇంకేమీ చెప్పలేకపోయిందామె.

కొద్ది సేపయ్యాక పిన్ని గుండెల మీద నుండి జరిగి ఆమె కళ్ళల్లోకి ఒక్కక్షణం చూచి తలవంచుకుని "నన్ను వెళ్ళనీ పిన్నీ" అన్నాడు. కొడుకు వైపు కళ్ళప్పగించి చూడడం తప్ప జవాబు చెప్పలేదామె. కళ్ళెత్తి మరలా అతనే అన్నాడు.

"నీ మీదగాని మరెవరి మీదోగాని కోపగించుకుని నేను వెళ్ళడంలేదు పిన్నీ! నేను స్థిరపడ్డాక నిన్ను తీసుకెళ్ళి కొన్నాళ్ళు నాదగ్గర వుంచుకుంటాను వుంటావా పిన్నీ?"

ఆమె కన్నీళ్ళ మధ్య నుండి చిరునవ్వు నవ్వి అంది, "అలాగేలేరా ఇప్పటికి ఆగిపో, రాత్రికి వెళ్ళువుగాని."

ఆరాత్రి రమేష్‌ను బాబాయ్‌కు చెప్పి రమ్మని పొలంలో పడుకున్న భర్త దగ్గరకు పంపింది జగదీశ్వరి. గదిలో రాజు, కమల, భారతి అమాయకంగా, నిశ్చింతంగా నిద్రపోతున్నారు. వెళ్ళి రాజు ప్రక్కన పడుకుందామె. ఆ స్పర్శకు వాడిటు తిరిగి అమ్మను గట్టిగా పట్టుకున్నాడు.

నిగనిగ మెరుస్తున్న వాడి బుగ్గ మీద ఒకముద్దు పెట్టుకుని మనసులోనే అనుకుంది జగదీశ్వరి,

"వీళ్ళందరిని వదిలి తనెక్కడికి వెళ్ళగలదు? ఈ మమతల బారినుండి తనకేనాటికి విముక్తి?"

కాళ్ళ దగ్గర చల్లగా తగలడంతో ఉలిక్కిపడింది.

"వెళ్ళొస్తాను. ఆశీర్వదించు పిన్నీ."

చటుక్కున లేచికూర్చుని కాళ్ళు దగ్గరగా జరుపుకుంటూ, గాఢంగా నిట్టూర్చి అంది అస్పష్టంగా,

"కన్నా! నువ్వు అడగాలా బాబూ నా ఆశీర్వాదం కోసం" ఏదో పోగొట్టుకోబోతున్నట్టు పిన్ని వైపు తదేకంగా చూస్తున్నాడతను. ఆమె ఉన్నట్టుండి అతని రెండు చేతులు గట్టిగా పట్టుకుని ఆవేశంగా అంది,

"కన్నా! నాకు భర్త కావాలి, పిల్లలు కావాలి, సంఘం కావాలి, అదిచ్చే గౌరవం కావాలి. అన్నిటి మధ్యా నువ్వు కూడా కావాలి. కానీ.. కానీ..నీకేం చెప్పను.. వెళ్ళు. వెళ్ళిపోరా. ఇంటికెళ్ళి ఇంకొకమారు పిన్ని తరిమేసిందని చెప్పు."

"పిన్నీ!"

అతను చెప్పే మాటలు విన్పించుకోకుండా అతని చెయ్యి పట్టుకుని వాకిటవరకు తీసుకొచ్చి రహస్యంగా చెప్పింది కాతర కంఠంతో,

"చూడు కన్నా! నా ఇంటి విషయాలు అమ్మకుగాని, అమ్మమ్మకుగాని తెలియనీయకు. నేను సుఖంగా వున్నానని చెప్పు."

చెమ్మగిల్లిన కళ్ళతో ఆ చీకటిలో పిన్ని వైపు వింతగా చూచాడు రమేష్.

"ఎందుకురా అలా చూస్తావ్. ఇంకా పిన్నిలో అహంకారం, దురభిమానం మిగిలి వున్నాయనా?" సన్నగా నవ్విందామె. ఆ నవ్వు అతని చెవుల దాకా సోకి అతనిని బాధ పెట్టింది.

వాళ్ళిద్దరినీ దూరం చేయడానికి బండి వాడు తొందరపడుతున్నాడు. కొడుకు తల వంచి నుదుటి మీద ముద్దు పెట్టుకుని అంది "సుఖంగా వెళ్ళిరా కన్నా! అందరినీ అడిగానని చెప్పు." ●





# కమలాజానకీయం

ఒక పూలరంగడికి కరోల్‌బాగులో కమల అనే స్నేహితురాలు, జోర్‌బాగులో జానకి అనే స్నేహితురాలు ఉన్నారు. శివుడికి గంగ మీద, పార్వతి మీద సరిసమానమైన ప్రేమ ఉన్నట్లు రంగాడికి తన ఇద్దరు స్నేహితురాళ్ళ మీద సమానమైన ప్రేమ ఉంది. ఈ విషయంలో అతడి నిజాయితీని శంకించవలసిన అవసరం ఎంతమాత్రమూ లేదు. ఆ ఇద్దరిలోనూ ఒకతె మీద ఎక్కువ మక్కువ చూపి, రెండవ ప్రేయసికి అన్యాయం చేసే దురుద్దేశం అతడికి ఏకోశానా లేదు. నేనుచెబుతున్నాగా, అతడికి ఆ ఇద్దరూ రెండు కళ్ళవంటివారు. ఆ ఇద్దరిలోనూ ఎవరినో ఒకరిని రోజుకి ఒక్కసారి చూడనిదే అతడు ఉండలేడు. ఈ రోజున ఫలానా అమ్మాయి దగ్గరకు వెళ్ళాలని ముందుగా ఏమీ నిర్ణయించుకోడు. ప్రతిరోజు సాయంకాలం ఏ క్షణాన బుద్ధిపుడితే అప్పుడు నీటుగాకడిగినముత్యంలా తయారై తాను ఉంటున్న మద్రాసు హోటలుకి దగ్గరలో ఉన్న ఇరవై ఆరో నెంబరు బస్సు స్టాపుకి వస్తాడు. ఏ వైపుపోయే బస్సు ముందర వస్తే ఆ బస్సు ఎక్కేస్తాడు, జోర్‌బాగ్ పోయె బస్సు ముందర వస్తే ఆ రోజున జానకిని కలుసుకుంటాడు. కరోల్‌బాగు పోయే బస్సు ముందర వస్తే ఆరోజున కమలను చూస్తాడు. ఈ ప్రకారంగా పక్షపాతం రవ్వంత కూడా లేకుండా ఆ రంగడు దక్షిణ నాయకత్వం వెలిగిస్తున్నాడు.

ఇక్కడ మరొక ముఖ్యమైన సంగతి పాఠకులకు విన్నవించాలి. మద్రాసు హోటల్ బస్సుస్టాపులో నిలుచుని, వాచీ కేసి చూస్తూ ఉంటే సరిగ్గా 20 నిమిషాల కొక్కొక్క బస్సు జోర్‌బాగు వెళ్ళేది వస్తుంది. అల్లాగే సరిగ్గా 20 నిమిషాల కొక్కొక్క బస్సు కరోల్‌బాగు వైపు వెళ్ళేది వస్తుంది. (ఢిల్లీలో సిటీ బస్సులు ఇంత నిక్కచ్చిగా రాకపోకలు సాగించడం, నభూతో న భవిష్యతి అని కొట్టి పారేయకండి. ఇరవై ఆరో నెంబరు బస్సులు 20 నిమిషాల కొక్కొక్కటి చొప్పున జమా నిక్కచ్చిగా నడుస్తున్నాయని అనుకుందాం మాట వరసకి.)

రంగడు బస్సు స్టాపుకి వాచీ చూసుకుని రాడు. ఎప్పుడు తోస్తే అప్పుడు వచ్చేస్తాడు. ఏ బస్సు ముందర దొరికితే అది ఎక్కేస్తాడు. అయినప్పటికీ ఒక ఏడాది పోయాక లెక్క చూసుకుంటే కమల దగ్గరకు 324 సార్లూ, జానకి దగ్గరకు 36 సార్లూ వెళ్ళినట్లు తేలింది! ఇంతటి హెచ్చుతగ్గులు ఎల్లా వచ్చాయో అతనికి తెలియలేదు. అతడు అనుకున్న దేమిటంటే కొంచెం ఇంచుమించుగా ఇద్దరి దగ్గరకీ చెరి సమానంగా వెళ్ళగలనని, కాని జరిగిన దిదీ.

ఈ విచిత్ర సంఘటనకి కారణం ఏమిటో మీరు ఊహించగలరా? జానకికి అన్యాయం చేసేశానేయని మథనపడిపోతున్న రంగడి మనస్సుకి ఊరట కలిగించగలరేమో ప్రయత్నించరాదూ?

పాపం, అది అతడితప్పు ఎంతమాత్రమూ కాదు. "బస్సు టైమింగ్‌ల"లో ఉన్న రహస్యం అది కరోల్‌బాగ్, జోర్‌బాగ్ పోయే బస్సులు టంచనుగా ఇరవయ్యేసి నిమిషాల కొక్కొక్కటి చొప్పున వస్తున్నాయన్న మాట నిజమే. అందులో పొరబాటు ఏమీలేదు. కాని, మద్రాసు హోటల్ దగ్గరకు ఆ బస్సులు సరిగ్గా ఏ సమయానికి చేరుకుంటున్నాయన్నది చాలా ముఖ్యమైన విషయం.




కరోల్‌బాగు పోయే బస్సులు మద్రాసు హోటల్ దగ్గరకు సాయంకాలం 4 గంటలకు గం. 4.20 కి, గం 4. 40 కి, లకీ గం. 5.00 కీ, గం. 5. 20 కీ, ఇల్లాగ ఇరవయ్యేసినిమిషాల కొక్కొక్కటి చొప్పున వస్తున్నా యనుకుందాం. జోర్‌బాగు వెళ్ళే బస్సులు మద్రాసు హోటల్ దగ్గరకు సాయంకాలం గం. 4.2 నిమిషాలకీ, గం. 4.22 కి గం. 4.42కి, గం. 5.2 నిమిషాలకి గం. 5.22 కి... ఇల్లా ఇరవయ్యేసి నిమిషాల కొక్కొక్కటి చొప్పున వస్తున్నా యనుకుందాం. అంటే కరోల్‌బాగ్ బస్సు కదిలిపోయిన 2 నిమిషాలకు జోర్‌బాగ్ పోయే బస్సు మద్రాసు హోటల్ దగ్గరకు వస్తుంది అన్నమాట. అల్లాగే జోర్‌బాగ్ బస్సు కదిలిపోయిన 18 నిమిషాలకు కరోల్‌బాగు బస్సు మద్రాసు హోటల్ దగ్గరకు వస్తుంది. కనుక రంగడు జోర్‌బాగు వెళ్ళగలగా— అంటే ఆ రెండునిమిషాల వ్యవధిలోనూ— అంటే 4.00 కీ 4.02 కీ మధ్యగాని 4.20 కీ 4.22 కీ మధ్యగాని 4.40 కీ 4.42 కీ మధ్యగాని, 5.00 కీ 5.02 కీ మధ్యగాని... బస్సుస్టాపుకి రావాలి.

కరోల్‌బాగు వెళ్ళగలగాలంటే ఆ 18 నిమిషాల వ్యవధిలోనూ—అంటే 4.02 కీ 4.20 కీ మధ్యగాని, 4.22 కీ 4.40కీ మధ్యగాని, 4.42 కీ 5.00 కీ మధ్యగాని... రంగడు బస్సు స్టాపుకి చేరుకోవాలి. అంటే కరోల్‌బాగు చేరుకోడానికి 18 నిమిషాల వ్యవధిలో ఎప్పుడైనా బస్సు స్టాపుకి రావచ్చునుగాని, జోర్‌బాగు వెళ్ళాలంటే 2 నిమిషాల వ్యవధిలో రావాలి. సరిగ్గా ఇదే నిష్పత్తిలో (18:2) లేక (9:1) నిష్పత్తిలో అతడు కమలను,జానకిని కలుసుకోగలడు.

18:2=324=36

బస్సుల టైమింగులు ఈ విధంగా ఉంటేనే 91 నిష్పత్తిలో ఆ స్నేహితురాళ్ళను కలుసుకోవడం సాధ్యం అవుతుంది. ఇద్దరి దగ్గరకు చెరి సమానంగా వెళ్ళగలగాలంటే కరోల్‌బాగు బస్సులు గం. 4.00, 4.20, 4.40, 5.00... ఇల్లా మద్రాసు హోటల్ దగ్గరకు వస్తే జోర్‌బాగు బస్సులు 4.10,4.30,4.50, 5.10 ఇల్లా వస్తూ ఉండాలి.

ఈ కమలా జానకీయం కథ వింటే ఎంతెంత స్వల్ప విషయాలు ఎంతలేసి ఇబ్బందులను కల్గించగలవో కొంతవరకూ అర్థం అవుతుంది. ●



'మోహినీ భస్మాసుర'లో యస్. వి. రంగారావు, పద్మిని.

చిత్రసమీక్ష :

# మోహినీ భస్మాసుర

లక్షలకొద్దీ డబ్బును వెచ్చించడానికీ లక్షణమైన చిత్రాలు తీయడానికి భేదం చాలా వుంది. డబ్బు ఖర్చు పెట్టగానే అది అభ్యురమవుకుంటే డబ్బులు తిరిగిరావడం ఖాయం. కావలసిన చోట ఆర్థికబలంతో పాటు అంగబలాన్ని, సాంకేతిక బలాన్ని చేకూర్చినప్పుడే దానికి సార్థకత ఏర్పడుతుంది. అప్పుడు ఫలానా దానికి ఇంత ఖర్చు పెట్టాము సుమా అని డబ్బాకొట్టుకో నక్కరలేకుండానే ఆచిత్రం బహుజనాదరణ పొందుతుంది. సువిశిష్టమైన పటుత్వమైన పర్యవేక్షణ లేకపోవడంతో ఇటీవల వచ్చే చిత్రాలు చాలవరకు పట్టుదప్పిపోతున్నాయి. అయితే, మచ్చు తునకలుగా నిలిచి, మచ్చును తొలగించేందుకూ కొన్ని ప్రయత్నం చేస్తున్నాయి. అలాంటి మచ్చుతునకల్లో తలమానికమైనది బి. ఏ. యస్. ప్రొడక్షన్స్ వారి మోహినీభస్మాసుర.

సురల గర్వభంగంచేయడానికి తగిన బల సంపన్నుడైన కుమారుణ్ణి ప్రసాదించమని శుక్రాచార్యుడు ఈశ్వరుణ్ణి ప్రార్థించాడు. ఈశ్వరుడు ప్రసాదించిన బిడ్డకు భస్మాసురుడని నామకరణం చేసి పెంచి పెద్దచేసి పెళ్ళిచేసి, దానవేశ్వరుడిగా చేశాడు శుక్రాచార్యులు. భస్మాసురుడు, ఈశ్వరుని వరం పొంది అగ్రహావేశంతో ముల్లోకాల్ని గజగజలాడించాడు. తనకు వరాన్ని ప్రసాదించిన ఈశ్వరుణ్ణే మట్టుపెట్టడానికి ప్రయత్నించాడు భస్మాసురుడు. అనువైన సమయాన్ని కనిపెట్టి విష్ణువు మోహినీ రూపాన్ని దాల్చి భస్మాసురుణ్ణి సమ్మోహితుణ్ణి చేసి, తనతో పాటు ఆడించి అతడి పీడ విరగడ చేసి లోకకల్యాణాన్ని స్థాపించాడు.

అందరెరిగిన పురాణకథకు అందాలు కూర్చిన దృశ్యకావ్యమిది. బిగువు సడలని కథ, గమనంలో ఉత్కంఠత, మనోరంజితమైన చిత్రీకరణ ఈ చిత్రానికి జీవం పోశాయి. చిత్రంనిండా రంగులీనే రంగారావుగారే కన్పిస్తారు. కావ్యాల్లో పురాణ పురుషులకి నిండు జీవం పోసి సాదృశ్యంగా నటించగల విశారదులాయన. మోహినితోపాటు భస్మాసురుడు నటించాడు—అది పురాణ కథనం. పద్మినితో పాటు రంగారావు నర్తించారు—ఇది వాస్తవం. ఈ సన్నివేశంలో ఆయనతోపాటు ప్రేక్షకుల్నీ నర్తింపచేసే ఉత్తేజాన్ని ఆయన కల్గించారు.

సంగీతం మరో ప్రత్యేక ఆకర్షణ. సంగీత మధలో ఈ చిత్రం ముంచెత్తబడింది. సంగీతకారులు యస్. రాజేశ్వరరావు మరో వెలుగు వెలిగారు.

దర్శకుని ప్రతిభకు బలిచక్రవర్తి కథను చూపించే ఘట్టం ఒకటి చాలు. అడుగడుగునా కొత్తదనంతో ప్రేక్షకుల అభిలాష మేరకు ఉన్న కథను మిన్నగా చిత్రీకరించారు. ఎన్నుకోబడిన పద్యాలు వినసొంపుగాను సందర్భసహితంగానూ వున్నాయి.

శివకేశవులు ఒక్కటేనన్న పరమసత్యాన్ని సుబోధకం చేసే ఈచిత్రానికి ఆభరణాలు— మోహినిగా పద్మిని, నారదుడుగా బాలయ్య, శంకరుడుగా రామకృష్ణ, విష్ణువుగా కాంతారావు, ఇంద్రుడుగా రఘురామయ్య, శుక్రాచార్యులుగా ధూళిపాళ, బలిచక్రవర్తిగా సత్యనారాయణ, వామనుడుగా బాబా, భస్మాసురుడి భార్య కల్యాణిగా అనూరాధ, కల్యాణి, గెస్ట్ ఆర్టిస్టులుగా రమణారెడ్డి, పద్మనాభం, అల్లురామలింగయ్య, నాగేష్ మొదలైన వారు, మరో ఇద్దరు చిరంజీవులుగానూ.

సాంకేతిక విలువలకు నిలబడగల ఈ చిత్రానికి ఛాయాగ్రహణం ఎల్లప్ప, పి. దత్, రవికాంత్, కళ: వాలి, కూర్పు: మార్తాండ్, నృత్యం: రాజు, జయరాం, రచన: గబ్బిట వెంకటరావు. ఇంద్రుడిచేత ఎక్కువ పాడించి నారదుడి చేత మాటలు మాత్రమే అనిపించడం, కైలాసం దృశ్యానికి ఎక్కువ శ్రద్ధ తీసుకోకపోవడం లాంటివి చంద్రుడిలో మచ్చలుగా వున్నా మంచి ఫలితాలను ఆశించగల దర్శకనిర్మాత: బి. ఏ. సుబ్బారావు. అందరూచూసి ఆనందించతగ్గ ఈ చిత్రం నవయుగ విడుదల.

—సి. కనకాంబరరాజా

అవీ.. ఇవీ

## కొత్త సుగంధద్రవ్యం

ట్రాకెన్ ఇంటర్ ప్రెస్ లిమిటెడ్‌వారు 'రెవ్ ద ఆర్' అనే కొత్త సుగంధద్రవ్యాన్ని వెలువరించారు. ఇది సుప్రసిద్ధ ఫ్రెంచి కంపెనీ ఎల్. టి. పివర్ (పారిస్) వారి తయారీని అనుసరించి చేసినది. ఈ సెంటు ప్రస్తుతం 7.5 సి. సి. ల సీసాలలో దొరుకుతున్నది.

## టి. ఐ. సైకిల్స్ (ఇండియా)

కేంద్ర పరిశ్రమలమంత్రి శ్రీ సంజీవయ్య ఇటీవల ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ వారి సైకిళ్ళు తయారు చేసే ఫ్యాక్టరీని దర్శించారు. ఆయనతో కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్లయిన శ్రీయుతులు ఎ.యమ్. యమ్. అరుణాచలం, యమ్. వి. అరుణాచలం, వున్నారు. జనరల్ మేనేజరు శ్రీ బి. ఎ. స్మిత్, జనరల్ వర్క్స్‌మేనేజర్ శ్రీ ఎం. యస్. రావు ఆయనకు ఫ్యాక్టరీని చూపించారు. పనివాళ్ళకు ఏర్పరచిన వసతి సౌకర్యాల్ని చూసి శ్రీ సంజీవయ్య మెచ్చుకొంటూ సంస్థను అభినందించారు.

కారుంగపోతే పీదరోంచి తెల్వొస్తున్నప్పుడు దర్శకుడు శ్రీ ఆదుర్తి సుబ్బారావు ప్రసాద్ ప్రొడక్షన్స్ ఆఫీసులోంచి వస్తూ కనిపించారు. విష్ చేశాను. "బాగున్నారా?" అంటూ పలుకరించారు. ఆయన మొహంలో, అలసట కనిపిస్తోంది. నిజంగా ఆయన అద్భుతమయిన వ్యక్తి. ఎంత శ్రమిస్తున్నా శ్రమిస్తున్నట్లు కనిపించరు. చిరునవ్వు ఎప్పుడూ పెదవుల మీద తాండవిస్తూ ఉంటుంది. "మిలన్ హడావుడిలో ఉన్నట్టున్నారు!" అన్నాను. "అవును. షూటింగ్ బుంకో వారంరోజులు ఉంటుంది" అన్నారు. "విశాలనేత్రాలు ఎప్పుడు ప్రారంభిస్తారు?" అన్న నా ప్రశ్నకు ఆయన సమాధానం చెబుతూ "మిలన్ షూటింగు అయిపోతే



"రంగులరాట్నం"లో సుకన్య

కోసంబట్టు, జనవరి ఎడిటింగ్‌లో కూచుంటాము. బహుశా ఫిబ్రవరిలో ప్రారంభిస్తాము!" అన్నారు. "మరి చక్రవర్తి చిత్ర చిత్రం ఎప్పుడు?" "బాబూమూవీస్ చక్రవర్తి చిత్ర చిత్రాలు రెండూ ఒకేసారి మొదలు పెడతాము" అంటూ చెప్పారు శ్రీ ఆదుర్తి. విశాలనేత్రాలకు ఆత్రేయ, చక్రవర్తి చిత్రవారి చిత్రానికి యస్. ఆర్. వంటి సంభాషణలు సమకూరుస్తున్నారు.

* * *

ఈ సందర్భంలోనే మా మధ్య-కొత్త తారల చర్చ వచ్చినప్పుడు "కొత్తవాళ్లనూ ప్రోత్సహిస్తూ వుండాలి, నిర్మాతలు. లేకపోతే వాళ్లు మాత్రం పైకి ఎలా వస్తారు?" అన్నారు, శ్రీ ఆదుర్తి తేనెమనసులు

# చిత్రలహరి

చిత్రం ద్వారా పరిచయం చేసిన కొత్తవాళ్లు ఒక్కొక్కరూ పరిశ్రమలో స్థిరపడుతున్నారని చెప్పవచ్చును. కృష్ణ— ఇద్దరు మొనగాళ్లు, అవేకళ్లు, అమాయకుడు, నందన మూవీస్, ప్రయివేటు మాస్టారు, వీనస్ అండ్ పద్మిని కంబైన్స్, చిత్రాలలో నటిస్తున్నాడు. రామ్మోహన్— ప్రయివేటు మాస్టారు, వీనస్ పద్మిని కంబైన్స్, రంగుల రాట్నం, రతి మన్మథ, విశర్రాత్రి 12 గం. లకు; సుకన్య—రంగులరాట్నం, ప్రయివేటు మాస్టారు, విశర్రాత్రి, శ్రీకృష్ణావతారం, ఇద్దరు మొనగాళ్లు; సంధ్యారాణి— ఇద్దరు మొనగాళ్లు—పుష్పకుమారి—ఇద్దరు మొనగాళ్లు, అవేకళ్లు; ఎం. వి. చలపతిరావు గృహలక్ష్మి చిత్రంలోను నటిస్తున్నారు.

* * *

"చిత్రానికి ఏం పేరు పెట్టారు?" అడిగాను. రివాల్వింగ్ కుర్చీలోంచి అటు నుంచి యిటు తిరిగి "ఇదే ప్రశ్న యీ లేఖలోనూ ఉంది" అన్నారు శ్రీ యస్. వి. రంగారావు. చేతిలోని కాయితాన్ని చూపిస్తూ "పూర్ణావారు రాశారు... ఇంకా పేరేమీ నిర్ణయించలేదు. మధ్యాహ్నం నరసరాజుగారు వచ్చాక కూచుని ఆలోచించాలి!" అంటూ చెప్పారు. శ్రీ యస్. వి. రంగారావు, యస్. వి. ఆర్. ఫిలిమ్స్‌వారి సాంఘికానికి దర్శకత్వం వహిస్తున్న విష



"సరస్వతీ శపథం"లో కె. ఆర్. విజయ

యంలో మా పాఠకులకు విదితమే.

* * *

నర్తనశాల తర్వాత—మోహినీ భస్మాసుర చిత్రం రంగారావుగారికి చక్కని పేరు తెచ్చి పెడుతుంది. చాలా శ్లాఘనీయంగా నటించారిందులో ఆయన. పతాక పిన్ని వేషంలో పద్మినితో కలిసి రంగారావుగారు కూడ భరతనాట్యం చేశారు. ఈ నాట్యం చేసింది రంగారావుగారేనా అనిపించేటంత అద్భుతంగా అభినయం చేశారు. చిత్రం చూస్తే మీరే చెబుతారు 'అమోఘ'మని.

* * *

ఏ. యం. రాజా చక్కని గాయకుడు. ఆయన పాడిన చూడుమిదే చెలియా, రంగా, కస్తూరిరంగా (విప్రనారాయణ) ఆడువారి మాటలకు అర్థాలే వేరులే (మిస్సమ్మ) ఆడెపాడె పసివాడ (పెళ్లికానుక) ఎందుకోయీ సయనమూ (దొంగల్లో దొర) మొదలయిన పాటలు యీనాటికీ ఆంధ్ర ప్రేక్షకుల హృదయాల్లో ముద్ర వేసుకున్నవి. రాజా గొంతులో మంచిస్థాయీ మాధుర్యమూ ఉన్నవి. నేపథ్యగాయకుల అవసరం ఎంతగానో ఉన్న యీ తరుణంలో మన నిర్మాతలు, సంగీతదర్శకులు. భావయుక్తంగా ఆలపించే శ్రీ ఏ. యం. రాజా మధురస్వరాన్ని ఎందుకు వినియోగించుకోవడం లేదో బోధపడని సంగతి.

* * *

"నేను పత్రికలో రాసిన "నన్ను ప్రేమించరూ?" వ్యాసం చదివి ఒకరు నిజంగానే ప్రేమిస్తున్నాను అంటూ ఉత్తరం రాశారండీ!" అంటూ నవ్వింది కృష్ణకుమారి. భువనసుందరి కథ సెట్లో రాకుమార్తె మందిరం అది. శోభాయమానంగా అలంకరించబడి ఉంది. కెమెరామన్ సి. నాగేశ్వరరావు తర్వాత షాట్ కోసం లైట్స్ సరి చూసుకుంటున్నారు. దర్శకుడు సి. పుల్లయ్యగారు స్క్రిప్టు ఫైలు చేతిలోకి తీసుకుని పరిశీలిస్తున్నారు. అంతలో నిర్మాత శ్రీ తోట సుబ్బారావు వచ్చారు. "పగలు పడుకోవడం అలవాటు నాకు. ధియేటర్స్ నడుపుతూండే వాణ్ణి కదూ! ఇరవై, ఇరవై అయిదు ఏళ్లుగా ఉండే అలవాటు" అన్నారు. "మీరు పడుకున్నా ఫరవాలేదు. మేం పడుకోకూడదు. లావెక్కిపోతాం!" అన్నది కృష్ణకుమారి. "ఎప్పుడయినా పొరపాటున పగలు ఒకసారి పడుకున్నానా. ఆమర్నాడు ఆ మరుసటి రోజు అదే వేళకి నిద్ర

పోయించు కొచ్చేస్తూ వుంటుంది. నాకు అందుకే భయం, పగలు పడుకోవాలంటే''.

*　　　*　　　*

శ్రీమతి జి. వరలక్ష్మి నటిగా విశేషమయిన అనుభవం గడించింది. వైవిధ్యంగల భూమికల నెన్నోటినో ధరించి, చక్కగా ఒప్పించి ఉత్తమ నటిగా పేరు గడించింది. ఆమె తమిళంలో ''హరిశ్చంద్ర'' చిత్ర నిర్మాణాన్ని యిటీవలనే పూర్తి చేసింది. తాను చంద్రమతి, శివాజీ హరిశ్చంద్రుడు నంబియార్ విశ్వామిత్రుడు, తంగవేలు నక్షత్రకుడు.. ఇపుడు ఆమె చంద్రశేఖర ఫిలింస్ పతాకం కింద ''మూగజీవులు'' పేరిట తెలుగులో ఒక సాంఘికం నిర్మిస్తున్నది. ఈ చిత్రానికి ఆమె దర్శకత్వం



"కంచుకోట' లో సావిత్రి

వహిస్తూండటం కొనియాడదగినది. దక్షిణ భారతదేశంలో తొలిసారిగా ఒక చిత్రానికి దర్శకత్వం వహించిన మహిళ భానుమతి. ఇపుడు శ్రీమతి జి. వరలక్ష్మి రెండవ మహిళా దర్శకురాలు. సాంకేతిక రంగంలో కూడా ఆమెకు పుష్కలంగా అనుభవం ఉన్నది గనుక, యీ చిత్రం ఆంధ్రప్రేక్షకులను ఆకర్షిస్తుందనడంలో అత్యుక్తి ఉండదు.

*　　　*　　　*

రవి ప్రొడక్షన్స్ అనే కొత్త సంస్థ ఒక సాంఘిక చిత్రాన్ని నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నది. ఈ చిత్రం ద్వారా కొత్త తారల్ని పరిచయం చేయడానికి సంకల్పించారు నిర్మాతలు. ప్రస్తుతం స్క్రిప్టు వర్కు జరుగుతున్నది. దర్శకుడు: ఏ. ఎల్. అప్పారావు, పర్యవేక్షణ: చాణక్య, సంగీతం: కోదండపాణి, రచన: వేణు.

—మోహన్ కుమార్ ●




















Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.